# పొదుప్పు మరియు రక్షకకు –
# స్టేన్స్ టైర్ రిట్రెడ్

చిరకాల మన్నిక, దారి బిగువు ఆకర్షణీయమయిన
రూపు, తక్కువ వ్యయములో అందచేయుచున్నారు — స్టేన్స్ టైర్ రిట్రెడ్

**స్టేన్స్ టైర్**

అండ్ రబ్బర్ ప్రొడక్ట్స్ లిమిటెడ్
ట్రిచీ రోడ్, కొయమత్తూరు-641 018

ఫ్యాక్టరీలు  కొయమత్తూరు, కొట్టాయం, విజయవాడ, ట్రిచీ, కాలికట్, మంగళూరు, వెల్లూరు, హైదరాబాద్, సేలం, ఎర్నాకుళం, టుటికోరిన్, త్రిచూర్, మధురై, బెంగళూరు, బళ్ళారి మరియు కాకినాడ






MAC/ST/002/TEL

# ఇప్పుడు మీరు కన్య మీకు కావలసిన రక్షణ ఒక్క కేర్‌ఫ్రీ* మాత్రమే ఇవ్వగలదు

కేర్‌ఫ్రీ మిమ్మల్ని దృష్టిలో పెట్టుకొని తయారు చేయబడింది. ఆ 5 రోజుల శానిటరీ రక్షణకోసం ఆధునికయువతికి చేదోడు.

కేర్‌ఫ్రీ ఒక ప్రత్యేకంగా చెమ్మనుపీల్చు నేప్‌కిన్. ఇది అధికమైన చెమ్మను పీల్చి మీకు ఇబ్బందిలేకుండా చేస్తుంది వాస్తవంగా, కేర్‌ఫ్రీ ఎంతపీల్చగలదంటే ఒకే ఒక నేప్‌కిన్ మీ పూర్తి సమయంలోని ప్రసరణలో సగం దాకా నిలుపుకోగలదు. కాని తాజా భావనకోసం మీరెంత తరచుగా కావాలంటే అంత తరచుగా మార్చుకోండి.

ఒక్క కేర్‌ఫ్రీ మాత్రమే దిగువ భాగము ప్రక్కలా చుట్టూ ఒక ప్లాస్టిక్ షీల్డ్ కలిగియున్నది. ఇది మరకల పట్ల త్రివిధ అడ్డంకిగా పనిచేస్తుంది.

కేర్‌ఫ్రీ తో మీరు హాయియైన భావన పొందగలరు, వెంటో ఇది ఏరోజో మీరు మరిచిపోతారు—చెమ్మ తగలటం ఉలికి అరవేసే ఇబ్బందిలేదు.

కేర్‌ఫ్రీ వాడకానికి తయారుగా వుంటుంది. మార్చుట చాలాసులభం. పారవేయుట చాలా తేలిక. అతి ఆరోగ్యకరమైనదిగూడా.

కేర్‌ఫ్రీ ధరించండి.

ఎల్లప్పుడూ విశ్వాసంతో ఉండండి.




10 మరియు 20 నేప్‌కిన్ల ప్యాకెట్లలో లభిస్తుంది.

Johnson & Johnson

*కేర్‌ఫ్రీ జాన్సన్ & జాన్సన్ యు.ఎస్.ఎ. వారి ట్రేడ్‌మార్క్. © J & J 78.

# ఉత్తరాలు

## మహాత్మాగాంధీ ?

30.1.81ఆంధ్రసచిత్రవారపత్రిక చదివాము ఈ వారం ప్రచురించిన "85 సంవత్సరాల భారత చలనచిత్రచరిత్ర"లో మహాత్మా పాత్రకి ఎవరు ? అంటూ మాస్టర్ రచ్చ భూమేశ్వర్ వ్రాసిన విషయాలు తెలుగు పాఠకులను తప్పుదోవ పటిం చేవిగా వున్నాయి.

బ్రిటిష్ దర్శకుడు సర్ రిచర్డ్ అటెంబరో రూపొందిస్తున్న భారీ ఆంగ్ల చిత్రం "గాంధి"లో గాంధిజీ పాత్ర ధారునిగా 36 సంవత్సరాలు వయసున్న బ్రిటిష్ నటుడు బెన్‌కింగ్‌స్లే ఎన్నిక దాదాపు మూడు నెలల క్రిందటే జరుగటము, తర్వాత ఆయన నాలుగు వారాల పాటు భారత దేశాన్ని సందర్శించటమూ, ఆ తర్వాత 'గాంధి' చిత్రానికి మొదటి షాట్‌కు నవంబరు 26 వ తారీఖున పాల్గొనటమూ జరిగింది.

అదే విధంగా కస్తూరిబాయి పాత్రకు మరాటీ రంగస్థలనటి, దర్శకుడు జైదేవ్ హత్తంగడి భార్య "రోహిణి హత్తంగడి" ని నిర్ణయించటం జరిగింది. పండిట్ నెహ్రూ పాత్రలో రోషన్ సేత్ నటిస్తున్నారు. అప్పుడే ఈ చిత్రాన్ని చాల భాగం ఢిల్లీ నగరంలోనూ, సహాయ నిరాకరణోద్యమం (1921) దృశ్యాల్ని ఢిల్లీ పరిసర ప్రాంతమైన తుగ్లకాబాద్‌లోనూ చిత్రించటం జరిగింది. 60సంవత్సరాల క్రిందట అహమ్మదాబాదు వద్ద గాంధిగారు నిర్మించిన సబర్మతీ ఆశ్రమాన్ని అదే విధంగా హార్యానా రాష్ట్రంలోని యమునా నదీ తీరంలో నిర్మించి చిత్రీకరణ మొదలు పెట్టారు.

కోట సత్యనారాయణ, వారి మిత్రులు.
(గుర్‌గాంవ్, హర్యానా)

## లోకం పోకడ

'ఆంధ్ర సచిత్రవార పత్రిక'లో లోకంపోకడ శీర్షిక ... ఆలోచనలు రేకెత్తిస్తుంది. ఎంతో ఆకర్షణీయంగా, అర్థవంతంగానూ, ఉంటున్న ఈ శీర్షిక చూశాకే మిగతా పేజీలు.

శ్రీపాద సత్యం [రాజమండ్రి]

## సంక్రాంతి సంచిక

సంక్రాంతి సంచికలో శాస్త్రి, కరివేపాకుజీవితం కథలు చాలా బావున్నాయి. స్పందన సీరియల్ చదువుతున్న కొద్దీ ఇంకా ఆసక్తి ఎక్కువవుతోంది. పండుగ కార్టూన్లు హాస్యంగా ఉన్నాయి. సంక్రాంతి సంచికలో ముఖ్యంగా పేజీలు చాలా అందంగా ఉన్నాయి. ముద్రణ సరిగా ఉంది. ముందు ముందు పత్రిక ఇలాగే వెలువడుతుందని ఆశిస్తాను.

చోడవరపు నాగేశ్వరరరావు (సికింద్రాబాద్)



## లోకంపోకడ * ఊశిమెన్











# నవశకానికి నాంది





రాష్ట్ర అవతరణ రజతోత్సవ సంవత్సరంలో వచ్చిన ఈ రిపబ్లిక్ దినోత్సవం ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ప్రత్యేక ప్రాధాన్యం కలది. శ్రీ టి. అంజయ్య సారథ్యంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, మూడు నెలల స్వల్ప కాలంలోనే అన్ని వర్గాల ప్రజల, ముఖ్యంగా బలహీన వర్గాల ప్రజల, సత్వరాభివృద్ధికి ఎన్నో చర్యలు తీసుకుంది.

శ్రీమతి ఇందిరాగాంధి (ప్రధానమంత్రి)

శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

## అమలు జరిగిన కొన్ని సంక్షేమ చర్యలు :

* ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధి 20 సూత్రాల ఆర్థిక కార్యక్రమం , కీ. శే. సంజయ్‌గాంధి 5 సూత్రాల కార్యక్రమం అమలు.
* రైతుల ఆర్థిక అభ్యున్నతికి వీలుగా రుణాల తిరిగి చెల్లింపు వ్యవధి పెంచారు. సకాలంలో తగినన్ని ఎరువుల సరఫరా, పంటల భీమా వంటి అనేక ప్రోత్సాహకాలు, సబ్సిడీల ద్వారా రైతులకు సర్వవిధాల సహాయం అందజేయడం.
* రైతులకు దాదాపు రు. 90 కోట్ల విలువైన రాయితీలు.
* మీటరు చార్జీల పద్ధతికి బదులుగా అశ్వికశక్తి (హార్స్ పవర్) ప్రాతిపదికపై ఏక మొత్తం రేట్లలో రైతుల విద్యుచ్ఛక్తి చార్జీలు విధింపు
* చక్రవడ్డీ విధించరాదని సహకార పరపతి సంఘాలకు ఆదేశం
* 65 సంవత్సరాలు పైబడిన వయస్సు గల వ్యవసాయ కూలీలు, అనాథలకు పింఛను పథకం.
* 5 ఎకరాల మాగాణి, 10 ఎకరాల మెట్ట గల రైతులకు భూమి శిస్తు చెల్లింపు నుంచి మినహాయింపు.
* గ్రామాలకు రోడ్లు, గ్రామీణ నీటి సరఫరా, బలహీనవర్గాలకు ఇళ్ళు, సామాజిక సేద్యపు నీటి బావుల నిర్మాణం, పనికి ఆహారం పథకాల మొదలైన సమీకృత గ్రామీణాభివృద్ధి పథకాల అమలు
* కరువు నివారణ సహాయక చర్యల నిమిత్తం రు. 27 కోట్లు కేటాయింపు.
* సత్వర అధిక విద్యుదుత్పాదనకు వీలుగా అనంతపురం జిల్లాలో 40 కి. వి. ల కొత్త జలవిద్యుచ్ఛక్తి ప్రాజెక్టు, 100 శాతం గ్రామీణ విద్యుదీకరణ పథకంలో మరో మూడు జిల్లాలు చేర్చడం, మెదకు జిల్లాలో అప్పుడే నూరు శాతం గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా కావడం గమనార్హం
* ఎన్. జి. వో. ల సంక్షేమానికి రాయితీలు.
* అవినీతిని అంతమొందించి, నిష్కళంక పరిపాలన ఏర్పాటుకు చర్యలు.
* అన్ని స్థాయిలలో పౌర సంఘాల ఏర్పాటుతో సహా అనేక చర్యల ద్వారా అత్యవసర సరుకుల పౌర పంపిణీ పద్ధతిని క్రమబద్ధం చేయడం
* రాష్ట్ర సమైక్యతా మండలి ఏర్పాటు. ఇటువంటి మండలిని ఏర్పాటుచేసిన ఏకైక రాష్ట్రం మన ఆంధ్రప్రదేశ్.
* స్కాలర్‌షిప్పుల మంజూరీ, హాస్టళ్లలో ప్రవేశ అర్హతల నిమిత్తం షెడ్యూలు కులాలు, తెగలు, వెనుకబడిన తరగతుల విద్యార్థుల ఆదాయ పరిమితిని రు. 6,000 నుంచి రు. 12,000 లకు పెంపుదల.
* వచ్చే ఐదు సంవత్సరాలలో గిరిజనుల సర్వతోముఖాభివృద్ధికి వీలుగా రు. 250 కోట్ల ప్రణాళిక అమలు.

**ఈ రిపబ్లిక్ దినోత్సవంనాడు మనమంతా బడుగువర్గాల అభ్యున్నతికి,**
**ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి పునరంకితమవుదాం.**

---

**సమాచార, పౌరసంబంధ శాఖ, ఆంధ్రప్రదేశ్.**

DIPR No 2186/Advt I/C 3-81.(1)

సీ రి య ల్

# రాగలహరి

శ్రీమతి మాధవపెద్ది పుణ్యశీలాప్రసాద్

"అదో— కథా కాదు, కమామీషూ లేదు. దానికి కావల్సిన సంబంధం కాకుండా చేసి, తన కూతుర్నిచ్చుకుంటోంది. అది వెళ్తే ఇంట్లో చాకిరెవడు చేస్తారు? భలే జాణ ఈవిడ! మొత్తానికి అక్షరాలా సవతి తల్లి అనిపించుకుంటోంది."

వెళ్తూ వెళ్తూ ఆ ముత్తయిదువులు ఈ మాటలు అనుకుంటూ వెళ్ళారు.

ఈ మాటలు గీతిక చెవిన పడ్డాయి. ఒక్కసారి ఉలిక్కిపడింది! 'నిజంగానే ఈవిడ చెయ్యలేదు గదా—దీంట్లో?' అనే అనుమానం కలిగింది.

(గత సంచిక తరువాయి)

మామయ్యను అడిగితే? అసలు కథ బయట పడుతుంది.

'అవును. అడగాలి.' అనుకుంది అను కుందేగాని ఎక్కడ అడగాలి? ఎట్లా అడగాలి? ఎప్పుడు? అనేది తోచలేదు.

పెళ్ళి వారం రోజుల్లోకి వచ్చింది

## 22

అహర్నిశలూ ఆలోచిస్తూనే వుంది గీతిక తగిన సమయం కోసం. చాకిరీతో సరిపోతోంది ఏ రోజూ. ప్రొద్దున వంచిన నడుము, రాత్రి పన్నెండు గంటలకి ఎత్తడం అవుతోంది.

జరిగినకథ—10 : ఆదర్శ దాంపత్య జీవితం సాగిస్తున్న చరణ్, పల్లవిలకు సంవత్సరాలు గడుస్తున్నా పిల్లలు కలగక పోవటంతో, బంధువుల దృష్టంతా వాళ్ళ మీదే వుండేది. కొంత కాలానికి పల్లవికి 'గొడ్రాలు' అన్న పేరు స్థిరపడి పోయింది. ఓ శుభ ముహూర్తాన ఆమె కడుపు తోందన్న వార్త ఆ దంపతులను ఆనంద పరచినా, బిడ్డ నెత్తుకునే వరకూ నమ్మకం లేదేమో! అన్న అనుమానం వాళ్ళని విచార సాగరంలో ముంచెత్తుతూ వుంటుంది. చరణ్ పల్లవిలకు పుట్టిన పాపకు 'శృతి' అని పేరు పెట్టు కొంటారు. చరణ్ కి ప్రమోషన్ రావటంతో చాలా బిజీ అయి పోతాడు. డ్రామాలో బాగా యాక్టింగ్ చేసిందని శృతిని అందరూ మెచ్చుకుంటుంటే, ఆమె కన్నతండ్రి చరణ్ రాక పోవడం తీరని వ్యథకు గురి చేస్తుంది పల్లవిని. పల్లవి మళ్ళీ గర్భవతి అయిందని తెల్సిన చరణ్ కి లోగడ డాక్టర్ చెప్పిన విషయం గుర్తుకు వస్తుంది. అతని మనస్సు పరి పరి విధాల ఆలోచిస్తుంటుంది. పాపను కన్న పల్లవి ప్రాణం పోవడంతో చరణ్ పిచ్చివా డవుతాడు. ఇక శృతి పరిస్థితి వర్ణనాతీతం. పల్లవి మరణానికి కృతే కారణంగా భావించిన చరణ్, ఆపాప ప్రసక్తి వస్తేనే మండిపడుతుంటాడు. చరణ్ ఇప్పుడిప్పుడే కోలుకొంటుం టాడు. శృతి తన పనులు తాను చేసుకోవటమే గాక పాప పనులన్నీ తనే చేస్తుంటుంది. తన ఎదురింట్లోకి క్రొత్తగా వచ్చిన గీతికతో పరిచయం పెంచుకొంటుంది శృతి. గీతికను ఆమె సవతితల్లి చాలా హీనంగా చూస్తుంటుంది. గీతిక మేనమామ సంజయ్‌తో ఆమె సంసార జీవితానికి పనికిరాదని లేనిపోని అభాండాలు మోపి,తనకూతురు చంద్రికను అతనికి కట్టబెట్టాలని చూస్తుంటుంది రత్తమ్మ. చంద్రిక, సంజయ్‌ల పెళ్ళికి ముహూర్తం పెట్టుకుంటారు. ఏదో ఓ సంబంధం చూసి గీతికకి ముడి పెట్టాలని చూస్తున్న రత్తమ్మ ఓనాడు వేదాంతంగారితో గీతికని చరణ్ కిద్దామని చెప్పగా, మండి పడతాడాయన.

సమయమే దొరకడం లేదు.

శుభలేఖలు వచ్చాయి దాంటో చంద్రిక పేరు చూస్తూనే, కోపం, కచ్చ కలిగాయి.

"ఎట్లా వుందో చూడవే గీతీ!..." అంటూ ఒక శుభలేఖ చేతికిచ్చింది రత్తమ్మ. చాలా అందంగా కొత్త మోడల్లో కొట్టిం చారు శుభలేఖలు చేతిలో శుభలేఖ పెట్టిం గానే, వంటింట్లో ఏదో పనివుందని వెళ్ళింది గీతిక.

ఆ శుభలేఖని ముక్కలు ముక్కలుగా చింపి, మండుతున్న పొయ్యిలో పడేసింది! మండుతున్న శుభలేఖని అట్లాగే చూస్తూ నిల్చుంది! ఎందుకో విపరీతంగా ఏడుపు వచ్చింది చేతుల్లో ముఖం పెట్టుకుని వెక్కి వెక్కి ఏడిచింది.

"గీతీ! ఆ ముగ్గు సగంలో వదిలావేం?" రత్తమ్మ వచ్చింది లోపలికి.

"ఏమిటే! ఏమయింది?" కంగారు పటిం చింది.

"ఏం లేదు." గబగబా అవతలికి వెళ్ళి పోయింది గీతిక.

పెళ్ళి పన్లలో సహాయం కోసమో, లేక పోతే గీతికమీద జాలే కలిగిందో, పెళ్ళి అను కున్నప్పటి నించీ గీతికకి చాలా ప్రాముఖ్యత నిస్తోంది రత్తమ్మ. అన్నిట్లోనూ సలహాల నడగడం, అన్నీ ముందు గీతికకే చూపించడం చేస్తోంది.

మరో రెండు రోజులు గడిచాయి.

ఆ రోజు— సంజయ్ తను వేయించిన కొత్త మోడల్ శుభలేఖలు చూపించడానికి వచ్చాడు.

అల్లంత దూరంలోనే అతడ్ని చూసింది గీతిక. "అడగాలి. ఇదే సమయం" అనుకుంది.

వాకిట్లో ఎవరూ లేరు. వచ్చేశాడు సంజయ్ కుర్చీలో కూర్చున్నాడు ఎప్పట్లాగే. మనసు ఉద్వేగంతో నిండిపోయింది. ఏదో వణుకు. ఆవేశం, ఆరాటం.

ధైర్యం కూడదీసుకుంటోంది. కాళ్ళు తడబడుతున్నాయి. అసలీ మధ్య సరిగా అన్నం తినడం మానేసింది. మనశ్శాంతి లేదు. దానికి తోడు రాత్రింబవళ్ళూ నెల రోజుల్నించీ పెళ్ళి పనులూ, చాకిరీ. చేతిలో వున్న శక్తంతా హరించుకుపోయింది గీతికకి. చాలా చిక్కి పోయింది. దీనంగా వుంది. ఒక చేత్తో కుర్చీని గట్టిగా పట్టుకుంది. వళ్ళంతా చెమటలు. మాటలు కూడదీసుకుంటూ

అతడి ముఖంవంక చూసింది. అతడు సాను భూతిగా చూస్తున్నాడు. అతడి ముఖం తన తల్లి ముఖం లాగేవుంది. అమ్మ ముఖం పోలికలు స్పష్టంగా కనబడుతున్నాయి. 'అవును. తన తల్లికి స్వంత తమ్ముడు మరి!' అమ్మని తలుచుకోగానే కళ్లంబడి నీళ్ళు తిరిగాయి. కళ్ళు మసక బారాయి.

"వంట్లో ఎలా వుంది గీతికా? నీరసంగా వుందా? ఏందుకట్లా వున్నావు? నువ్వు రెస్టు తీసుకోవాలి గీతికా. ఏందుకట్లా ఊరికే తిరిగి స్ట్రెయిన్ చేసుకుంటావు?" పడబోతున్న గీతికని పట్టుకుంటూ అడిగాడు సంజయ్!

అట్లాగే అతడి గుండెల కంటుకుపోయి— భోరున ఏడవాలనిపించింది గీతికకి.

అంతలో, ఎక్కడ్నించో చంద్రిక ఊడిపడింది! ఒక్క క్షణం వాళ్లనా స్థితిలో చూసి, భ్రుకుటి ముడిచింది. సంజయ్ ఏమీ పట్టించుకోలేదు.

గీతికని కుర్చీలో కూచోబెడుతూ, "చంద్రికా — మీ అక్కకి కాస్త కాఫీ ఇవ్వు— నీరసంగా వుంది" అన్నాడు.

వెంటనే లోపలికి వెళ్ళింది చంద్రిక. వెళ్ళడం ఇష్టం లేకపోయినా, వెళ్ళింది.

"నాకేం ఫరవాలేదు, బానే వున్నాను." అంటూ కుర్చీలోంచి లేచింది గీతిక.

"గబగబా అడిగేయాలి, చంద్రిక కాఫీ తెచ్చేలోగా" అనుకుంటూండగానే, చంద్రిక వచ్చేసింది రెండు నిమిషాలైనా కాలేదు వెళ్ళి— "అక్కా! అమ్మ నిన్నోసారి లోపలికి రమ్మంది, నడవగలవా?" అడిగింది

అసలు సంగతి వాళ్ళిద్దర్నీ అట్లా ఏకాంతంగా వదలడం ఇష్టం లేదు.

ఒక్కసారి నిస్సహాయంగా చూసి లోపలికి వెళ్ళింది గీతిక. ఆ చూపుకి కలవరపడ్డాడు సంజయ్!

దయ తలచిందో, ఏమో - గీతికకి కాఫీ గ్లాసు అందించింది రత్తమ్మ. కూతురికి, అల్లుడికి కప్పుల్లో పోసి, తీసుకువచ్చింది కాఫీ

కాఫీ అందుకుంటూ, సంజయ్ అందించిన శుభలేఖని చూసి పొంగిపోయింది రత్తమ్మ.

"బావుందయ్యా! చాలా బావుంది." అంటూ ఉబ్బితబ్బిబ్బయి పోయింది.

"మీ కభ్యంతరం లేకపోతే, మా ఫ్రెండ్స్ కొందరికి మేము కలిసి ఇన్విటేషన్సు ఇవ్వాలను కుంటున్నాం. మీ అమ్మాయిని పంపించ గలరా?" అన్నాడు సంజయ్ వచ్చిన పనిని బయటపెడుతూ.

"అట్లాగే నాయనా! దానికేం. నీ ఇష్టం. అది నీ కాబోయే భార్య. ఎక్కడికన్నా తీసికెళ్ళచ్చు. దానికి నన్నడగాలా?" అంది రత్తమ్మ తనలో తనే మురిసిపోతూ

చంద్రిక మనసు ఎగిరి గంతులేసింది. గులాబీరంగు డ్రస్సులో, గులాబీ పువ్వులాగా అందంగా మెరిసిపోతోంది చంద్రిక.

చంద్రిక అందాన్ని చూస్తూ, మనసులో ముల్లులాగా గుచ్చుతున్న గీతిక అనారోగ్య విషయాన్ని మర్చిపోవడానికి ప్రయత్నిస్తున్నాడు సంజయ్!

మరో పావుగంటకి చంద్రిక, సంజయ్‌లు బయటికి వెళ్ళిపోయారు.

గీతిక అడగాలనుకున్నది అడగనే లేక పోయింది! అవకాశమే దొరకలేదు

## 23

ఆ రోజు పెళ్ళి కూతుర్ని చేస్తున్నారు చంద్రికని. ఇంటినిండా బంధువులు. గీతికకి క్షణం తీరిక లేదు.

"గీతీ ..! పోయి పేరంటం పిల్చిరామ్మా"

కసి కలిగింది గీతికకి "నేను పోను..." గట్టిగా అరవాలనుకుంది. కానీ అందరిఎదుట మంచిది కాదనుకుంది.

"నేను చంద్రికి తలంటి పోస్తున్నాను. ఇంకెవరినన్నా పంపించమ్మా" అని మాత్రం అంది.



గీతికకి వెళ్ళడం అనిష్టం లేనేలేదు. తప్పించుకోవాలంటే వీలులేదు.

"ఏవరేళ్తారే ? అయినా మనం కాకుండా ఇంకెవరున్నా వెళ్తే బావుంటుందా ! వాళ్ళేమనుకుంటారు ? తొందరగా తలంటి ముగించి వెళ్ళమ్మా."

మాట్లాడలేదు గీతిక.

"చిన్నప్పుడు, నేనూ మీ నాన్నా తిరగలేక చచ్చాం. పెళ్ళికని అందర్నీ పిల్చి, పిల్చి ... ఇంత ఇవాళ కూడా నేనెక్కడ వెళ్ళను ? నా మాట విని వెళ్లమ్మా ... నా అమ్మవి కదూ ?" గడ్డం పట్టుకుని బతిమలాడింది రత్తమ్మ, అందరూ చూస్తుండగా !

తన చీరల్లో, ముదురురంగు పట్టుచీర గీతికకి తీసి యిచ్చి కట్టుకోమంది. ఆ చీరని విసిరి బయటికి గిరాటు కొట్టాలనిపించింది, గీతికకి. ఎంత బతిమాలినా వినిపించుకోకుండా, అట్లాగే వెళ్లిపోయింది కుంకుమ భరిణె తీసుకుని, బయటికి.

వచ్చిన వాళ్ళంతా సానుభూతిగా చూస్తున్నారు, గీతిక వంక. అది భరించలేక పోతోందామె ముత్తైదువులంతా వచ్చారు. మేళగాళ్ళు వచ్చారు. పందిరికి కట్టిన తోరణాలు మెరుస్తున్నాయి. రంగురంగుల కాగితాలు కత్తిరించి కట్టారు వరసగా. చంద్రిక తలంటుయి వచ్చాక, హాస్యాలతో, పాటలతో ముస్తాబు చేశారు. ఆ తరువాత రత్తమ్మ ఒక పళ్ళెంలో ముదురు నీలం రంగు పట్టుచీర, జాకెట్టు గుడ్డలు తెచ్చి బొట్టు పెట్టి ఇచ్చింది కూతురికి.

# రాగలహరి

మంగళ వాయిద్యాలు మ్రోగుతున్నాయి. కంచి పట్టుచీరలో మెరిసిపోతోంది చంద్రిక. కళ్ళకి కాటుక, కాళ్ళకి పసుపు – పారాణీ, బుగ్గన చుక్క, చెవులకి కొత్త మోడల్ జూకాలు, మెళ్లో రాళ్ళ నెక్లెస్ చేతులకి బంగారపు గాజులు, వాటి మధ్య నీలం, ఎరుపు మట్టిగాజులు, వేలికి ప్రధానపు ఉంగరం, గోరింటాకు పెట్టిన చేతులు, తల నిండా పూలు, కాళ్ళకి వెండి గజ్జెలు, మూర్తీభవించిన సౌందర్యవతిలాగా వుంది చంద్రిక. మళ్లీ హారతిచ్చారు. పాటలుపాడారు. తోడి పెళ్లికూతురుగా పసిదాన్ని రాధికని కూర్చోబెట్టారు. బుల్లి పట్టు పరికిణీతో, ఎంతో ముద్దుగా వుందాపాప.

గీతిక మాత్రం సాదా వాయిలు చీరతో ఏ నగలూ లేకుండా, అలసిన ముఖంతో, వచ్చిన వాళ్ళకి పసుపులు పూస్తూ, బొట్లు పెడుతూ, తాంబూలాలు ఇస్తూ, కాఫీ ఫలహారాలు అందిస్తూ, ఏదో ఒక పనిలో మునిగిపోయి వుంది.

రత్తమ్మ పెద్ద పట్టుచీరతో, హడావిడిగా తిరుగుతోంది ఆవిడకి అంతా బాగానే వుంది కానీ– ఒక్కటే చికాకును కలిగిస్తోంది వచ్చిన వాళ్లందరూ అడుగుతున్నారు– పెద్ద పిల్లకి చెయ్యకుండా, దీనికి చేస్తున్నారేం 'పెళ్ళి' అని! 'ఆ పిల్ల మేనమామకి ఆ పిల్ల నివ్వకుండా, దీన్నిస్తున్నారేం ?' అనీను !

అక్కడికీ అడిగిన వాళ్ళందరికీ ఓపిగ్గానే జవాబులు చెప్పుకొస్తోంది ఏవేవో వంకలు చెబుతోంది వాళ్ళు నమ్మకపోయినా ఊరు కుంటున్నారు. ఆవిడటు వెళ్ళంగానే గుస గుసలు మొదలు పెడుతున్నారు.

ఆ విధంగా ఒకళ్ళు అడగడం, ఈవిడ జవాబు చెప్పడం గీతిక చెవిన పడనే పడింది!

"ఏం వదినా ! సంజయ్‌కి పెద్ద పిల్లనని చాలా రోజులుగా అనుకున్నారుగా ! ఏమయిం దిప్పుడు ? చేసుకోనన్నాడా ?" దూరపు బంధువు ఒకావిడ ప్రశ్న.

"అవును–వదినా !" రత్తమ్మ జవాబు.

"ఏం, ఎందుకని ?"

"పిల్ల ఆరోగ్యం బాగాలేదు వదినా."

అనుకోకుండా అనేసింది రత్తమ్మ ఈసారి. ప్రతిసారీ, ఎంతో జాగ్రత్తగానే జవాబు లిస్తూ వచ్చింది.

వింటూనే గీతిక అదిరిపడింది 'ఏమిటి, తన ఆరోగ్యాని కేమయింది! ఏక్షేపంతా వుంటేను ?'

గీతికని ఆవిడ గమనించలేదు. ఇంకా ఏదో అంటోంది –

"డాక్టర్లు కొన్నాళ్లవరకూ పెళ్ళి చెయ్య కూడదని చెప్పారు వదినా ! ఆ పిల్లాడు అంత దాకా ఆగలేనన్నాడు. మన చెయ్యి జారిపోతాడేమోనని మేమూ భయపడ్డాం. కానీ, అతడే చంద్రికని చేసుకుంటానన్నాడు."

"ఎంత అబద్ధం! అన్యాయం, ఇది అన్యాయం." గీతిక హృదయం ఘోషించింది.

"ఏ పిల్లయితేనేం. మనింటి అల్లుడు కావడం ముఖ్యం అనుకున్నాము మేమూను. ఇంక దీనికీ మరో ఆరు నెలలో చేసేస్తాం, నెమ్మదిగా మరో సంబంధం చూసి..." ఇంకా అంటూనే వుందావిడ ఏదేదో. కళ్ళు తిరుగుతున్నాయి గీతికకి. గబగబా సామాన్ల గదిలోకి వెళ్ళి, నిలబడలేక కళ్ళు మూసుకుని ఒకమూల కూలబడింది.

"ఎంత కల్పితం ? ఇదంతా ఈవిడ చేసిందే! తన అనుమానం నిజం అయింది. సందేహం లేదు. మామయ్యకేదో నూరిపోసి తనకు కాకుండా చేసింది ఈవిడే. ఈవిడకితన మీద ప్రేమ లేదనే అనుకుందిగానీ, ఇంత ద్రోహం చేస్తుందనుకోలేదు. మామయ్యకి తన కూతుర్నిచ్చుకుందామనే ఈ పన్నాగం పన్నిందన్న మాట! తనెంత మూర్ఖురాలు! ఆవిడ మాటలన్నీ నమ్మి, మామయ్యమీద కసి పెంచుకుంది. ఇందులో మామయ్య తప్పేం



వుంది? తనసలు మామయ్యతో మాట్లాడిం దెప్పుడు? అతడికి మాట్లాడడానికి అవకాశ మిచ్చిందెప్పుడు? ఇద్దరూ కలిసి మాట్లాడు కుంటే గదా, ఒకరికొకరు అర్థమయ్యేది? ఎంత పొరపాటు జరిగిపోయింది? ఇదిమోసపు పెళ్ళి! ఈ పెళ్ళి జరగకూడదు. తను గొడవ చేసయినాసరే ఆపాలి. మామయ్యకి అంతా చెప్పెయ్యాలి— అప్పుడేం చేస్తాడో చూడాలి తననే చేసుకుంటాడో, లేకపోతే చంద్రికనే... ఊహూఁ! వీల్లేదు.''

అంతలో రత్నమ్మ వచ్చింది ఆ గదిలోకి. గీతికలో ఆలోచనలు సుళ్ళు తిరుగుతున్నాయి. ఆవేశం కలిగింది. రత్నమ్మని చూస్తూనే,

''అమ్మా! నాకు జబ్బున్నావే. ఏం జబ్బో కాస్త చెబుతావా ?''

ఆవేశాన్ని అణచుకుంటూ శాంతంగానే అడిగింది గీతిక. విస్మయపోయింది రత్నమ్మ.

''ఏమిటే!జబ్బేమిటె?...నేనేమన్నాను...? నే వెళ్ళాలి...అవతల పనుంది బోలెడు...'' వెళ్ళబోయింది.

''ఆగు ... ఒక్క నిమిషం. నాకు జవాబు చెప్పి వెళ్ళాలి నువ్వు ... నన్నే డాక్టరుకి చూపించావు ? నన్ను పెళ్ళి చేసుకోకూడదన్న డాక్టరెవరు ? చూపించు, నేనడుగుతాను.''

తలుపు కడ్డంగా నుల్చుంటూ అడిగింది గీతిక. గీతిక విడ్డూరపు ప్రవర్తనకి కాస్త భయమే కలిగింది రత్నమ్మకి.

అయినా ధైర్యం తెచ్చుకుంటూ —

''ఏమిటే నీ మాటలూ! నీ ప్రేలాపన ? అడ్డులే, నేను వెళ్ళాలి.'' విదిలించింది రత్నమ్మ.

''వెళ్ళడానికి వీల్లేదు. కథలు అల్లి, కల్పించి చెప్పి ... మామయ్యని నాకు కాకుండా చేశావు ... ఇల్లు లగ్గానే పండగయిపోదు. ఇంకా మూడు ముళ్ళూ పడలేదు, గుర్తుంచుకో. ఇప్పుడు స్వయంగా నేనే వెళ్ళి, మామయ్యతో అన్ని విషయాలూ చెప్పేస్తాను. నన్ను వదిలి, ఈ పెళ్ళి ఎట్లా చేసుకుంటాడో చూస్తాను ...'' ఆవేశంగా అంది.

''ఎక్కడికే నువ్వు వెళ్ళేది ? నోర మూసుకుని పడుండు. వెళ్తుందిట, వెళ్తుంది ఇన్నాళ్ళూ ఇంత తిండి పడేసి, బట్ట ఇస్తున్నాను. ఇంకనించీ అది కూఁ

# అమెరికాలో మట్టికొంపలు !

తిండి, బట్ట, నీరు ఎంత ముఖ్యమో, తల దాచుకోవటానికి ఇల్లు కూడా అంతే అవసరం. స్వల్ప వ్యయంతో సమస్త సదుపాయాలు కలిగిన గృహ నిర్మాణానికి నిరంతర కృషి జరుగుతూనే ఉన్నది.

నిర్మాణపుఖర్చు పెరుగుతున్న కారణంగా, అమెరికాలో భూగృహాలు, మట్టితో కప్పబడిన గృహాలు అతి చురుకుగా నిర్మిస్తున్నారు. కార్యాలయాలు, పాఠశాలలు, షాపులు కూడా ఈ నూతన పద్ధతిలో నిర్మిస్తున్నారు. మ్యూచువల్ ఆఫ్ ఓమహా అనే నిర్మాణ సంస్థ మూడంతస్తులుకల భూగృహనిర్మాణం తలపెట్టింది. ఇందుకు 1 కోటి 23 లక్షల డాలర్లు ఖర్చు అవుతుంది. పోగా 50 లక్షల డాలర్లు ఆదావేయ గలుగుతుంది.

అమెరికా అంతటా ప్రస్తుతం 3000 దాకా ఇలాంటి గృహాలు నిర్మాణంలోఉన్నాయి. మట్టితో కప్పబడిన గృహాలు కూడా ఈ పథకంలో ఉన్నాయి. వీటిలో భూగృహాలు నేల అడుగున కడితే, మట్టితో కప్పబడిన ఇళ్ళు భూమిపైన కడతారు. వీటిని అన్ని వైపులాగాని, కొన్నివైపులా గాని మట్టితో కప్పుతారు. మట్టితో కప్పిన కట్టడాలు చలి కాలంలో వెచ్చగాను, వేసవిలో చల్లగానూ ఉంటాయి. వీటిని మామూలు ఇళ్ళకంటే చౌకగా నిర్మించవచ్చు.

నేటి ఈ భూగృహాలు, మట్టి ఇళ్ళు పాతకాలం వంటివి కాదు. వీటిలో అన్ని సదుపాయాలు కలుగజేస్తున్నారు. కొన్ని గృహాలలో ఈతకొలను, వెనుక స్థలంకూడా అమర్చుతున్నారు. ఇటువంటివి అట్లాంటా లోనూ, మాంట్రియల్ లోనూ పలుసంవత్స రాలుగా ఉన్నాయి.

చలికాలంలో నివసించే గదిని వెచ్చచెయ్యడానికి 175డాలర్లు వంటచెరుకు మాత్రమే వీరు ఉపయోగించారు. ఇది, వీరి ఇరుగు పొరుగువారు మామూలు ఇంధనాలపై చేసిన వ్యయంలో సగం మాత్రమే. స్నేహితులు ఈయన్ను "కేవ్‌మ్యాన్" అంటారు. స్టీవెన్ దంపతులకు ముగ్గురు సంతానం. వీరి ఇంటికి రెండు ముఖద్వారాలు ఉన్నాయి. వీటిలో ఒక దాని నుండి లివింగ్ రూమ్‌లోకి ప్రవేశిస్తారు. ఈ ముఖద్వారాలకి ఇరువైపులా కిటికీలు ఉన్నాయి. చక్కటి తివాచీలతో, సాంప్రదాయకంగా అమర్చబడి ఉంటుంది ఈ గది. మరొక ద్వారంగుండా పడక గదిలోకి వెళ్ళవచ్చు. లివింగ్ రూమునుంచి, మిగిలిన గదులకు ద్వారాలు ఉన్నాయి. ఈ గదిలో అమర్చిన రూమ్ హీటర్ నుంచి వేడి, సీలింగుకి అమర్చిన కిటికీల నుండి సూర్య కాంతీ మిగిలిన గదులలోకి ప్రసరించడానికి వీలుగా ఈ ఇంటిని నిర్మించారు. మొక్కలు ఆరోగ్యవంతంగా పెరగడానికి కావలసిన సహజ కాంతి ఇంటిలోపలికి ప్రసరిస్తుంది అంటారు శ్రీమతి స్టీవెన్స్. వీరి గృహంలో ఆధునాతనమైన వంటగది, ఇస్త్రీ పరికరాలు, టెలివిజన్, రెండు టెలిఫోనులు ఉన్నాయి. ఒకవైపు మినహా అన్నివైపులా మట్టితో కప్పబడినప్పటికీ వీరికి ఏటువంటి ఇబ్బంది కలగదు.

భూగృహాలలో ఇంధన పొదుపు అధికం. మినెసోటా విశ్వవిద్యాలయంలోని విలియంసన్ హాలు రెండంతస్తుల భూగృహం. ఇందులో పుస్తకాలషాపు, రికార్డుల కార్యాలయం ఉన్నాయి. ఈ భవనంలో విద్యుచ్ఛక్తి వినిమయం 65 శాతం దాకా పొదుపు అవుతున్నది. కొద్దినెలలో సౌరశక్తి పరికరాలు సమకూర్చిన తరువాత మరొక 17 శాతం ఇంధనం పొదుపు చెయ్యవచ్చు, అంటారు థామస్ పి. బ్లి. ఈయన మినెసోటా విశ్వవిద్యాలయంలోని సివిల్, మెకానికల్ ఇంజనీరింగ్ శాఖలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్నారు.

ఇంధనం పొదుపే కాకుండా, అగ్నిప్రమాదాలు, తుఫానుల వల్ల కలిగేనష్టాలను కూడా ఇలాంటి కట్టడాల ద్వారా నివారించవచ్చు.

"మట్టి బయటినుంచి వచ్చే శబ్దాలను అరికడుతుంది. ఇందువల్ల విమానాల రొద వినిపించదు" అంటారు మినెసోటాలోని స్టిల్‌వాటర్‌లో నివసిస్తున్న డెరిక్ జోన్స్.

(అమెరికా సెంటర్)

---

కరువవుతుంది జాగ్రత్త! నువ్వు ఏడిచి చచ్చినా, ఈ పెళ్ళి ఆగదు. నిన్ని గడప దాటనివ్వను. పెళ్ళయేదాకా నిన్ని గదిలోనే పెట్టి తాళం వేస్తాను ఈ గడపదాటి రానివ్వను బయిటికి! ఏం చూసుకునే, నీ మిడిసిపాటు? అయినా వాళ్ళిద్దరూ ఇష్ట పడ్డారు. పెళ్ళి చేసుకుంటున్నారు. నువ్వు కళ్ళల్లో నిప్పులు పోసుకుంటావేం?"

గీతికని నెట్టుకుని బయటికి పోబోయింది. గీతిక మరింతంగా అడ్డుపడింది "లే... అన్నులే...నిన్నే...అడ్డు లెమ్మంటుంటే?"

"నేను లేవను. నువ్వు బయటికి పోవడానికి వీల్లేదు. అందరూ ఇక్కడ గుమి గూడాలి. అందరికీ ఈ విషయం తెలియాలి. అప్పుడు, పెళ్ళిఅదే ఆగిపోతుంది మామయ్యకి కూడా తెలిసి."

కసిగా అంది గీతిక. వెంటనే ఆమె చెంప ఛెళ్ళుమంది. "నోర్మూయ్ ... తాహతు తెలిసి మాట్లాడు. పిచ్చిగా వాగుతున్నావ్... ఇట్లాంటి వెధవ వేషాలేశావంటే, ఇంట్లోంచి బయటికి వెళ్ళగొడతాను. జాగ్రత్త! ఒళ్ళు దగ్గిర పెట్టుకో. ఎవరితో మాట్లాడు తున్నావో తెలుస్తోందా?"

ఎన్ని తిట్లు తిన్నా ఛిఛ్కారాలు పడినా దెబ్బలు మాత్రం తినలేదింతవరకూ, గీతిక. ఈ దెబ్బతో ఆమె దిమ్మెర బోయింది. అసలే నీరసంగా వుండడంతో కళ్ళు బైర్లు కమ్మాయి. అదే అదనని చెయ్యి పట్టి ఇవతలికి లాగి, తలుపు తీసుకుని అవతలకి వెళ్ళి, తలుపు బయట గడియ వేసేసింది. రత్తమ్మ. తన పనిమీద తను వెళ్ళిపోయింది. గీతిక గురించి అడిగిన వాళ్ళందరికీ, తల నొప్పని, పడుకున్నదని చెప్పింది.

గీతిక గదిలో అచేతనంగా వుండిపోయింది, అట్లాగే ఎంతోసేపు. ఆ తరువాత తెరిచిన గీతిక కళ్ళకి, చల్లటి చిఱునవ్వులు చిందిస్తున్న తల్లి ఫొటో కనబడింది. అది అసలు డ్రాయింగు రూములో వుండాల్సింది. మన్నాలు కొత్తటప్పుడు తీసి, సామాన్ల గదిలో పడేసింది రత్తమ్మ. అది మళ్ళీ తీసి తగిలించనేలేదు. తల్లి ఫొటోని చూస్తూనే ఉప్పెనలాగా ఏడుపు వచ్చింది, గీతికకి.

"అమ్మా! చూశావా? ఎంత అన్యాయమో? నువ్వుంటే ఇట్లా జరిగేదా?" వెక్కి వెక్కి ఏడిచింది.

తలుపు లాగి చూసింది రాలేదు. తనని లోపల బందీ చేశారన్నమాట! కొంతసేపు గడిచింది. ఏదో బాధగావుంది లోపల తలుపు

బయట గడియ తీసిన చప్పుడు. ఇంద్ర లోపలికి వచ్చాడు.

"ఎవరు ? ... నువ్వామ్మా గీతా ! నువ్విక్కడున్నావా ? బయటెవరు గడియ



పెట్టారు ? నిన్ను చూడలేదా ?" అంటూ వచ్చిన పనిని మరిచిపోయి ప్రశ్నించాడు.

గీతిక మాట్లాడలేదు. గీతిక దగ్గరగా వచ్చాడాయన. గీతిక తల్లి ఫొటో చేతిలో పట్టుకుని, ఏడుస్తోంది. ఆయన గుండె కరిగిపోయింది.

(ఇంకా వుంది)

— సీరియల్ —

# స్పందన

— మంధా వెంకట రమణారావు —

( గత సంచిక తరువాయి )

అమెరికా నుంచి రామం వచ్చేడు. లక్ష్మి రాలేకపోయింది ఆమెకి ఏడో నెల. విమానయానం పనికి రాదన్నారు. రామం ఎంతో మారిపోయినట్లు కనిపించేడందరికీ. మనిషిలో విశేషమైన కళ కనిపిస్తోంది. హుందాతనం, హుషారు, చొరవ, ధైర్యం ఎక్కువయ్యేయి. తండ్రి ఫోటో చూసి కన్నీరు పెట్టుకున్నాడు రామం. ఎలా పోయిందీ ప్రతి చిన్న సంగతీ కనుక్కొని ఆ క్షణంలో తను ఇక్కడ ఉన్నట్లు భావించుకొని తృప్తి పొంద ప్రయత్నించేడు.

కొడుకులిద్దరూ కర్మకాండలు ఘనంగా చేసేరు. రామం తనతో తెచ్చిన ఐదు వందల డాలర్లూ రూపాయలుగా మార్చి అందులో మూడొంతులు ఈ ఇంటికి ఖర్చుపెట్టేడు. కాశీ వెళ్ళి తండ్రి అస్థికలు కలిపి వచ్చేడు. వచ్చిన చిన్నాన్నలకీ, మేనత్తలకీ వారు వెళ్ళేటప్పుడు ప్రయాణం ఖర్చు ఇవ్వటమే కాక బట్టలు పెట్టేడు. "నాన్న పోయేరు! మరి మీరు మేం పిలిచినా రారు! నాన్న తరఫునించి ఈ బట్టలు మీరు తీసుకోక తప్పదు!" అని రామం అనగా అతడు తండ్రి గుణాగణాలని పుణికి పుచ్చుకున్నాడని పొగిడేరు.

అందరూ వెళ్ళేరు సద్దు మణిగింది. అప్పుడు అసలు నిర్ణయం తీసుకోవాలని రామం శ్రీనునీ, చంపనీ పిలిచి అడిగేడు, "ఇప్పుడు మిగిలింది ఈ ఇల్లు. చంపా భావి! ఈ రెండింటి మీదా మనం ముగ్గురం ఒక నిర్ణయానికి వస్తే నాకు శాంతంగా ఉంటుంది. నాన్న చంపా పెళ్ళి గురించే బెంగ పెట్టుకున్నారు!"

"నీ అభిప్రాయం ఏమిటన్నయ్యా? అది ముందు చెప్పు!" అన్నాడు శ్రీను. మీనాక్షి ఈ ప్రసంగం వస్తుందని ముందే గ్రహించి భర్తకి తన అభిప్రాయం నూరిపోసింది. ఇల్లు అమ్మమంది — ఆ డబ్బు మూడు భాగాలు వేసి చంపాకొక భాగం ఇమ్మంది. చంపా పెళ్ళి బాధ్యత, అనగా అయ్యేఖర్చులు, రామం తీసుకోవాలంది. ఏదో ఓ సంబంధం, అట్లాంటికిపోక- నిశ్చయించేసి రామం వెళ్ళే లోపున పెళ్ళి జరిపించేమంది. తన దృష్టిలో ఉన్న ఒకటి రెండు సంబంధాలు చెప్పింది.

ఆ మాటకొస్తే కర్మకొచ్చిన బంధువులంతా తలొక సంబంధం చంపా కోసం మాటసాయంగా చెప్పేరు. పెళ్ళి ఆడంబరంగా జరిపించమన్నారు. ఈ పెళ్ళి కొడుకులంతా ... ఒకరు మెడికల్ రిప్రజెంటేటివ్...ఒకరు స్టెనోగ్రాఫరు... ఒకరు భార్యపోయి,.. పిల్లలు లేని లెక్కలు మాష్టారు...ఒకరు కలెక్టరాఫీసులో క్లర్కు... ఒకరు టాటా నగరంలో ప్లాంట్‌లో పని చేసే వర్కరు ... ఇలా ఎన్నో సంబంధాలు ఎరికలోకి వచ్చేయి. వీరిలో ఎవరో ఒకర్ని పట్టి పెళ్ళి జరిపించడం కష్టంలేదు.

రామం తన అభిప్రాయం చెప్పేడు ... "ఈ ఇల్లు మరామత్తు చేసి అద్దెకిద్దామని ఉంది. అద్దె ఎంతిచ్చినా, ఇంటిని ఒక స్మారక చిహ్నంగా జాగర్తగా ఉంచుకోవాలని నా కోరిక. ఇక్కడ మన చిన్నతనం అంతా గడిచింది. నేనెప్పుడన్నా ఈ దేశం వస్తే ఎక్కడికి వెళ్తాను, మన ఇంటికి తప్ప?"

"మరో మంచి ఇల్లు కొనుక్కోవచ్చు నన్నయ్యా?"

"మరో ఇల్లు నాకవసరం లేదు. ఈ ఇల్లు అమ్మేసేక మరో ఇల్లు కొన్నా, కట్టినా నాకు నా దేశం వచ్చి, నా ఇంట ఉన్నట్లుండదు. శ్రీనూ, ఇంక చంపాని ఒక యోగ్యుడికిచ్చి పెళ్ళి చెయ్యాలన్నది నా అభిప్రాయం? ఇందుకు తొందరపడి ఏదో సంబంధం దొరికింది కదా అని నేను వెళ్ళేలోపున చేసెయ్యడం సబబుకాదు. మంచి సంబంధం అంటే తిండికీ బట్టకీ లోటు లేకూడదు, భార్యని తనతో సమానంగా ఒక మనిషిగా చూసే విద్యావంతుడు. ఏడాది లోపున ఏ సంబంధమూ కుదరకపోతే చంపాని అమెరికా తీసుకుపోతాను" రామం చెప్పేడు.

శ్రీను [illegible] భార్య తనకి ఉపదేశించిన [illegible] సానుకూలంగా అయ్యేటట్లు లేదు... "కాదన్నయ్యా! నువ్వు అక్కడుంటావు... ఇక్కడ చంపా గురించి అనిశ్చితంగా ఉండిపోతుంది పరిస్థితి. మంచి సంబంధాలే ఉన్నాయి. మన మిత్రులం వ్రాసుకుంటే మా మామగారు సాయపడతానన్నారు. వారంలో మంచి సంబంధమే నిశ్చయం చేసి మాఘమాసంలో పెట్టి, ఈ ఇంటే పెళ్ళి జరిపిస్తాం. అదయ్యాక ఇల్లు అమ్మేసి, మూడు భాగాలు వేసి, ఒక భాగం చంపా

**జరిగిన కథ–15 :** చంప నాన్న కాశీపతి చాలీ చాలని జీతంతో ఆ ఇంటిని అలానే నెట్టుకొస్తుంటాడు. చంప నాన్నమ్మకి ఓపిక ఉన్నంత కాలమూ చాకిరీ చేయించుకొన్న కొడుకులూ, కూతుళ్ళూ ఆమెకు ఓపిక తగ్గడంతో ఆమెను పోషించటానికి వంతులు పడ్డారు. గతంలో తన కంపెనీ బాక్సు దొంగిలించిన అప్పారావుని తన ఫ్రెండ్ సరోజా అని చెప్పి తన ఇంటికి నాన్న చెప్పగా ఆహ్వానిస్తుంది చంప. అనుకోకుండా అనేకమైన ఖర్చులు నెత్తిన పడడంతో ఇల్లు అమ్మగా వచ్చిన తన వాటా మొత్తం ఖర్చయిపోతుంది. ఈలోగా చంపా పెద్దమనిషయి కూర్చుంటుంది. రాముని వైజాగ్ ఇంజనీరింగ్ కాలేజీలో చేర్పిస్తాడు నాన్న. చంపా కాలేజీలో చేరుతుంది. తాను చేసుకున్న పెళ్ళి ఒప్పందం ప్రకారం లాయర్ ప్రకాశరావు శ్రీనుని మెడికల్ కాలేజీలో చదివిస్తాడు. రామం, లక్ష్మిలు ప్రేమించుకొంటారు. రామం, లక్ష్మిల పెండ్లి అయిన తరువాత వాళ్ళు హనీమూన్ యాత్రకి వెళ్ళి తిరిగి వస్తారు. తను చదువుకున్న స్కూల్లోనే ఉపాధ్యాయినిగా చేరుతుంది చంప. శ్రీను, మీనాక్షిల పెండ్లి ఆడంబరంగా జరిగిపోతుంది. లక్ష్మి రామం దగ్గరికి చేరుకొంటుంది. రామం లక్ష్మిని పెళ్ళి చేసుకున్నాడన్న నిజం తెలిసిన అమ్మ నిద్ర మాత్రల ప్రభావంతో ప్రాణం పోగొట్టుకోగా, చంపా కుమిలి పోతుంది. అమ్మ పోయిన బాధ నుండి పూర్తిగా కోలుకోని చంపా నాన్న కూడా పోవడంతో ఆమె దిక్కులేనిదౌతుంది.

కిద్దాం ... చంపా భావి స్థిరపరచకుండా నువ్వు వెళ్ళిపోకు!'' అంటూ చెప్పేడు ...

అన్నదమ్ముల్లో ఒకరు తన బాధ్యతని నిర్వర్తించి బరువు తగ్గించుకోవాలనీ, రెండో వారు తన స్వార్థ దృష్టితోనూ ఆలోచిస్తున్నట్టు అర్థమయింది చంపాకి. ఆమె వ్యక్తిత్వం ఒక దృఢత్వాన్ని సంతరించుకుంది. తల్లిపోయి, తనే తండ్రికి పరిచర్యలు చేయవలసి వచ్చినప్పటినించీ- రామం, శ్రీనూ ఈ ఇంటికి వచ్చిన బంధువులుగా మాత్రం కనిపించేరు తను ఏ క్షణమైనా పోవచ్చున్న బెంగ ఏర్పడగానే తండ్రి రామంకీ, శ్రీనుకీ ఒక నిర్ణయం వంటి ఉత్తరం రాసి ఉంచేరు. అందులో అన్నదమ్ము లిద్దరూ ఈ యిల్లు చంపాకి వదిలి పెట్టాలని ఆదేశించారు. ఈ యిల్లు కాశీపతి స్వంతం కాబట్టి, అది విల్లులా పనిచేస్తుంది. ఆ ఉత్తరం చంపా అన్నలకిచ్చి ఏమందంటే... ''నాన్న ఈ యింటిని నా కిచ్చినా నేనేం చేసుకోను. మీ యిద్దరిదీ ఈ యిల్లు. కాని ఈ యింటిని అమ్మటం నా కిష్టంలేదు అమ్మేస్తా మంటారూ? నేను చెప్పేదేమీ లేదు. అది మీ హక్కు! ఇంక రామం అన్నయ్య నన్ను అమెరికా రమ్మన్నాడు... కాని నేను ఎక్కడికీ వెళ్ళను ఈ దేశం వదిలి. నా పెళ్ళి గురించి బెంగ పెట్టుకోకండి ఎలా జరగాలో అది జరుగుతుంది. నాకు ఉద్యోగం ఉంది. బి. యిడీ ట్రెయినింగ్‌కి ఎన్నయి చేసేను. నా ట్రెయినింగ్ అయిపోతే స్థిరంగా నౌఖిరీ వుంటుంది. ట్రయినింగ్ కోసం కొంతడబ్బు నా ఆర్జనలోంది నిలవచేసుకున్నాను... నా గురించి చింత పడకండి!'' అని తన అభిప్రాయాన్ని నిర్దుష్టంగా వారి మనసులు నొవ్వకుండా చెప్పింది.

## 36

ఉన్న నెల రోజులూ రామం తండ్రి కర్మ చెయ్యటంతోనూ, ఇంటికి మరమ్మతులు చెయ్యటంతోనూ, ప్రొఫెసర్లనీ, బంధుమిత్రులనీ కలియడంతోనూ గడిపేసేడు. మళ్ళా భారతదేశం ఎప్పుడు వస్తాడో తెలీదు. తిరిగి రావాలని అనిపించడం లేదు. ఇక్కడి పరిస్థితి నానాటికీ తీసికట్టుగా వుంది. చదువు ఉన్నవాడికి ఉద్యోగం లేదు. ఉద్యోగం ఉన్నవాడికి అతడి ప్రావీణ్యతని పూర్తిగా ఉపయోగించుకుందుకి ప్రోత్సాహంలేదు. విద్యా సంస్థలలో ఏ విభాగం చూసినా, ప్రభుత్వపు విజ్ఞాన పరిశోధనా సంస్థలని తీసుకున్నా మేధావులకు భావిలేదు. నాసిరకం మనుషులు పైస్థానాలాక్రమించుకొని, తమని కాకాపట్టే వారికే చేయూత ఇస్తున్నారు. కాకాపట్ట ఇష్టపడని నిజమైన ధీశక్తి వున్న విజ్ఞులు, విజ్ఞానవేత్తలు, యువకులు తమ ప్రతిభ గుర్తింపులేక, నైరాశ్యాన్ని పెంచుకున్నారు. పరిశోధనలకి డబ్బు ఉండదు. సరైన పరికరా లుండవు. ఉన్నాసరే ఆ డబ్బు విభాగపు ముఖ్యుడి ఏదో పనికిరాని ఆలోచనని ఆచరణలో పెట్టడానికి ఖరీదైన పరికరాలనీ, పనిముట్లనీ కొని మూలని పడేయడానికి ఉపయోగించబడుతోంది ఇటువంటి దిగజారిపోయిన పరిస్థితులలో సైంటిస్టులు, డాక్టర్లు, ఇంజనీర్లూ విదేశాలకు పోతున్నారంటే వారిని నిందించి ఏం లాభం ఉంది, అనుకున్నాడు రామం. రీసెర్చి చేస్తున్న ఇన్స్టిట్యూట్ లోనే అమెరికాలో లెక్చరర్‌గా ఉద్యోగం దొరికింది. రీసెర్చి పూర్తయి, డాకరేట్ వచ్చాక స్థిరపడుతుంది ఉద్యోగం లేదా అంతకన్న మంచి ఉద్యోగం సులభంగా దొరుకుతుంది. లిల్లీకి వచ్చే ఏడువందల డాలరు, తనకిప్పుడు వచ్చే ఎనిమిదివందల డాలర్లతోనూ జీవితం హాయిగా గడిచిపోతుంది.

ఇద్దరు పిల్లలతో, సంతానోత్పత్తికి స్వస్తి చెప్పి ద్రవ్యోత్పత్తిలో పడదలచుకున్నాడు. హైర్ పర్చేజ్ సిస్టమ్ కింద ఒక ఇల్లు కొన్నాడు లాసేంజలిస్‌లో. టి. వి. కొన్నాడు. ఇంటికి ఫర్నిచరు...ఇంకా కావల్సిన ఎలక్ట్రిక్ పరికరాలూ కొన్నాడు. కారు కొన్నాడు. అన్నీ అరువే. ఇల్లు ముప్ఫయి ఐదువేల డాలర్లు. నెలనెలా డబ్బు కట్టేస్తారు పదిహేను సంవత్సరాలు. ఫర్నిచరూ, టి వి. ఫ్రిజిడేరు ... కారూ ఇత్యాదులకి నెలనెల వాయిదాల కింద డబ్బుపోతుంది. వీటన్నింటికీ లిల్లీ తెస్తున్న డబ్బు సరిపోగా, తన డబ్బులోంచి కూడా వెయ్యవలసి వస్తోంది. కాని మనస్సు ప్రశాంతంగా ఉంది. జీవితం హాయిగా వెళ్ళిపోతోంది. లిల్లీ ప్రేమ సుధ మాధురిలో జీవితం ఆనందమయమయింది బ్రతుకొక్క అర్థం, గమ్యం ఏర్పడ్డాయి.

ఇవన్నీ ఉన్నా చంపా గురించి తలుచుకున్నప్పుడు మనస్సులో ఎక్కడో గిల్టీ ఫీలింగ్ తలెత్తుతుంది. లిల్లీ మరీ మరీ చెప్పింది.

"చంపా మనస్సేమిటో కనుక్కొని ఆమె పెళ్ళి జరిపించండి. లేనప్పుడు ఆమెనిక్కడికి తీసుకవచ్చి ఏర్పాట్లు చెయ్యండి" అని. ఆల్లీది ఎంత విశాల హృదయం! మచ్చుకి వెతుకు దామన్నా ఎక్కడా స్వార్థగుణం కనిపించదు! తను ఎలా చెప్తే అలానే నడుచుకుంటుంది. అందరికీ ఏది మంచో అటువంటి సలహా ఇస్తుంది. నీ, నా అన్న భేదం లేకుండా తన ఆర్జనంతా కుటుంబం కోసం ఖర్చు చేస్తోంది. ఈమెకీ, శ్రీను భార్య మీనాక్షికీ ఎంత భేదం! కులం, గోత్రం, శాఖ, హోదా ఇవన్నీ చూసి తెచ్చుకున్న సంబంధం అది... కాని అందులో స్వార్థమే మిగిలింది. ప్రకాశరావు కూతురుకి ఒక భర్తని కొని తెచ్చిన భావం...మీనాక్షికి భర్త తనకి తండ్రి తన డబ్బుతో తెచ్చిపెట్టిన వస్తువు అన్న అధికారం ... వీటిని అధిగమించలేకపోయేడు శ్రీను. పెళ్ళి అయిన నాడే తమ కుటుంబంతో వాడి సంబంధం తెగిపోయింది. అందుకు శ్రీనుని అనీ లాభం లేదు. వచ్చిన భార్యమీద మగాడి మనస్తత్వమూ ఆధారపడి ఉంటుంది. ఆమెతోనూ, మామతోనూ కలహించి తన బతుకు నరకం చేసుకోమని ఎవరు శ్రీనుని కోరలేరు కదా? తెలిసి తెలిసీ కేవలం తన భావికోసం, చదువు కోసం మీనాక్షిని పెళ్ళి చేసుకున్నాడు శ్రీను. తరవాత ఆమె పాద దాసుడయ్యేడు. వాడి మనస్తత్వానికి ఆ పరిస్థితి సరిపడింది. హాయిగా సుఖంగా ఉన్నాడు.

ఇల్లు మరమత్తులు జరిపించడంలో నయితేనేం, తమ ఇంటి కష్టసుఖాలతో నయితేనేం ఆత్మీయత కనపరిచిన మరో వ్యక్తి అప్పారావు! తమ కులపువారు, తమ బంధువులూ వెన్ను చూపినప్పుడు తన తండ్రినీ, తల్లినీ కష్టసుఖాలలో ఆదుకున్న ఆ మనిషికి తన కృతజ్ఞత ఎలా చెప్పకోడమో రామానికి అర్థం కాలేదు. ఎప్పుడో చిన్ననాడు తనని ఆదరించిన కాశీపతి మాష్టారిమీద గౌరవం ఎంత దృఢంగా పేరుకపోయింది అతడి మనసులో! చంపా అంటే అభిమానం, ఆ అభిమానంలో ఎక్కడా ఎత్తి చూపడానికి దోషం లేని ప్రవర్తన...సోదర భావం కాక మరేముంది అందులో? ఇద్దరూ నువ్వా నువ్వా అనుకుంటారు ... కలుపుగోలుగా ఉంటారు...ఒకరి నొకరు చూసుకున్నప్పుడు తమ కనిపెట్టినదేమిటంటే స్నేహార్ద్రత తప్ప కాముకత, స్త్రీ పురుష ఆకర్షణ భావం ఎక్కడా తనకి కనిపించలేదు.

ఇంటి దర్జా మార్చబడింది. కొత్త పెంకు వెయ్యబడింది. ఇంటికి విద్యుత్తు వచ్చింది. కొళాయి కోసం ఏర్పాట్లు జరిగేయి. ఇంటిని రెండు భాగాల కింద వెయ్యడం జరిగింది. గదులు పెద్దవి, వాటిని రెండేసి భాగాలు చేసేరు. చంపా ఇక్కడే ఉండి, తన ఉపాధ్యాయిని వృత్తి చేసుకోదలచింది కాబట్టి, ఒక భాగాన్ని తమకు బాగా తెలిసిన ఒక కుటుంబానికి నలభై రూపాయలకి అద్దె కిచ్చేరు. రామం ఇంటిమీద తన హక్కు చంపా కివ్వడమేకాక, శ్రీనుని కూడా అలానే చేసేలా చేసేడు అది కొంత కష్టమయినా! శ్రీను నసిగేడు. మీనాక్షి ఏమంటుందోనని భయపడ్డాడు తను వెళ్ళి ఆమెతో మాట్లాడ వలసి వచ్చింది. ఆమె ఎక్కడా మెత్తపడ లేదు తమకున్న అప్పుల జాబితాని వల్లె వేసింది—తమ భావి, తమ పిల్లల భావి, ఈ ఇంటి తమ వాటా అమ్మితే వచ్చే డబ్బు మీద ఆధారపడి ఉన్నట్లు మాట్లాడింది. శ్రీను తల వంచుక వినడం తప్ప మరేమి చెయ్యలేకపోయేడు. ఆఖరికి రామం ఒక నిశ్చయానికి వచ్చి శ్రీను హక్కు వదిలేసు కుంటే తను ఐదువేలు చెల్లిస్తానని చెప్పేడు. "ఆ ఇల్లు అమ్మితే ఇప్పుడు ముప్ఫయివేలు రాదా?" అని అడిగింది మీనాక్షి! "ఆ ఇంటికి మరామత్తుకి ఖర్చుకి మీ భాగంపోదా? మరామత్తు అయినాక కదా దాని ధర పెరిగింది?" అంతటితో ఊరుకోలేదు రామం ... తగిన జవాబు ఇవ్వాలనుకున్నాడు— "అంతేకాక అమ్మ పోయినప్పుడూ, ఇప్పుడు నాన్న శ్రార్ధ కర్మలకీ మొత్తం రెండు మూడువేలు ఖర్చు నేనే భరించేను. అందులో సగభాగం శ్రీనుకి పంచుదామను కుంటున్నాను. నేను అమెరికా వెళ్ళాక ఈ నాలుగయిదేళ్ళలోనూ రెండువేల డాలర్లన్నా ఇంటి ఖర్చుకోసం పంపేను. మీరేమన్నా పంపి ఉంటే మినహాయించుకొని, మిగిలిం దానిని చెరిసగం బరువుని పంచుదామను కుంటున్నాను. ఇవన్నీ జరుగుతే మీకు ఇంటి వాటాకి రావల్సిన దానికన్న ఎక్కువే తిరిగి మీకు పడుతుంది..."

అన్న ఇంత నిష్కర్షగా మాట్లాడ్డంతో శ్రీను కలుగజేసుకున్నాడు. "అన్నా! నువ్వన్న మాటేకానీ, ఆ ఐదువేలూ నాకు వద్దు! ఆ ఇల్లు మొత్తం చంపాకి రాసిద్దాం! కానీ ఒక సంగతి. చంపా పెళ్ళికి కట్నకానుకలు, పెళ్ళి ఖర్చులకీ ఆ ఇల్లే ఆధారం! నా దగ్గర మరేమి లేదు! అప్పుడు ఇల్లమ్మి చంపా పెళ్ళి చెయ్యాక తప్పదు!" భర్త, బావగారి బుట్టలో పడుతున్నాడని భయపడ్డ మీనాక్షి అతడి తెలివితేటలకి సంతోషించింది!

"చంపా పెళ్ళికి ఖర్చులకి నేను డబ్బు పంపుతాను. నా చదువుకని ఇంటిమీద చేసిన అప్పు తీర్చేసేను. కాబట్టి చంపా పెళ్ళి కట్నానికి ఇంటిమీద అప్పు తీసుకరావచ్చు మంచి సంబంధం చూసే పూచీ నీది! పెళ్ళి



Eswar

# స్పందన

జరిపించే పూచీ నీది! నేను మళ్ళా ఈ దేశం రాలేను కదా ఇంత వేగం!'' ఖచ్చితంగా రామం చెప్పేడు.

ఈ మాటలు జరుగుతున్నప్పుడు చంపా లేదు. ఈ సంభాషణ విశాఖలో శ్రీను ఇంట్లో జరిగింది.

మీనాక్షి తన మనసులోని అక్కసు వెళ్ళగక్కింది. ''అదెంత కష్టమో బావగారికి తెలుస్తే ఇంత సులభంగా చేతులు దులిపేసు కోరు?''

''చంపాకేం తక్కువ? అందముందీ- వయసుందీ- చదువుంది- మంచి గుణ ముందీ! ఉద్యోగం ఉంది!'' రామం కోపం తెచ్చుకోకుండా అన్నాడు.

''అన్నీ వున్నాయి కాని సంబంధాలె రావడంలేదు... కారణం మీకు నేను చెప్ప నవసరం లేదుగా?''

''ఏమిటి కారణం ?''

''ఒక కారణం కాదు. రెండు కారణాలు! నేను మీతో నిష్కర్షగా చెప్తున్నందుకు నన్ను క్షమించాలి. మనం సమాజంలో ఉన్నప్పుడు లోకుల సెంటిమెంట్సుని కూడా గమనించాలి కదా?''

''ఏమిటి అంత సహించలేని కారణాలు?''

''ఇవి నా భావాలు కావు బావగారూ! నన్ను తప్పు పట్టకండి! ఒకటీ మీరు లిల్లీని పెళ్ళిచేసుకోడం- అందువల్ల చంపా కుటుంబ సాంప్రదాయం పోయినట్టే ఒక భావన!''

''మీ కెవ్వరికీ కష్టం కలిగించకుండా మే మంతా అందుకే కదా అమెరికా పోయాము? ఇంకా అవసరమైతే మీ బంధువులమని చెప్పు కోకండి!'' నోట మాట లేకుండా కూర్చున్న శ్రీనుకేసి చురుగ్గా చూసి అన్నాడు రామం.

''బంధుత్వం... రక్త సంబంధం ఎలా పోతాయి? పోనీ అదీ వదిలీండి... అది మీ ఇష్టం... రెండో కారణం గురించి మీ తమ్ముడు చెప్తారు-నాకెందుకు నిష్ఠూరం?'' మీరు మాట్లాడండి అన్నట్టు శ్రీను కేసి చూసింది మీనాక్షి.

శ్రీను గొంతు సవరించుకొని నసుగుతూ అన్నాడు... ''ఆ అప్పారావు గాడికి నాన్న అంత చనువివ్వడం నాకు మొదటి నించీ ఇష్టం లేదురా అన్నయ్యా! చంపా వాడితో చనువుగా ఉండడం నలుగురూ నాలుగు రకాలుగా అనుకుందికి దారితీసింది! దాంతో వచ్చే సంబంధాలు కూడా రావడం లేదు వాళ్ళ కులమేమిటి... మన కులమేమిటి? వాడు తాగుతాడనీ, ముండల ముఠాకోరని వినికిడి!''

రామంకి కోపం కట్టలు తెంచుకుంది... ''నీ స్వంత చెల్లెలు గుణంమీదే నీకునమ్మకం లేదురా తమ్ముడూ? అమ్మా, నాన్నా అప్పారావుని అభిమానించేరు. మనల్ని పెంచేరు. కాని ఆ మనిషి మనకన్న ఎక్కువగా వాళ్ళని ఆదుకున్నాడు! పక్కనున్న నువ్వు ఒక్కసారన్నా ఆ బాధ్యత తీసుకున్నావా? అప్పారావు తాగుతాడు... ముండల ముఠాకోరు అని ఎవరో అంటే నువ్వు నమ్మేవు. అతని తండ్రి గుణాలు అతడి కుంటాయన్న ముద్ర వేసేసేరు. తాగుబోతూ, ముండల ముఠాకోరూ అయివుంటే ఆ కుర్రాడీనాడు ఐదు లారీలకీ, నాలుగు బస్సులకీ ఓనరవడు! తన సంసారాన్నే కాక, తన సవతి తల్లినీ ఆమె పిల్లల్నీ ఆదుకోడు! విన్నావా? అప్పారావు మణి వంటివాడు! ఈ క్షణం వాళ్ళిద్దరూ ఇష్టపడుతే వారిద్దరికీ పెళ్ళి చెయ్యడానికి నా అభ్యంతరం లేదు! కాని వారి మధ్య నాకు అన్నా చెల్లెళ్ళ భావం తప్ప మరో భావం అగపడ లేదు! నీ కింకా అపనమ్మకం ఉంటే అప్పారావునీ, చంపనీ నీ ముందే అడుగుతాను!''

అన్నకింత కోపం రావడం చాలా కాలం తర్వాత ఇదే మొదటిసారి. చిన్నప్పుడు బేట్‌మెంటెన్ కోర్టులో తనని 'బాట్'తో అన్న కొట్టడం గుర్తుకొచ్చింది. తను ఏడ్చి నాన్న చేత అన్నని తన్నించేడు. ఇప్పుడు భార్యని అడ్డు పెట్టుకొని మాటలన గలుతున్నాడు... కాని చంపా, అప్పారావుల పెళ్ళి సంగతి మీద అన్న భావాలు వినే సరికి ఖంగు తిన్నాడు! మీనాక్షి ముఖం ముడుచుకుంది !

''చాలు! చాలు! అదొక్కటే అప్రతిష్ట మిగిలిపోయింది! పుట్టని పిల్లలకి పేర్లు పెట్టకండి! నాన్నకి చెప్పి ఏదో సంసారపక్షమైన సంబంధం చూస్తాం... ఆ మూడు ముళ్ళు వేయించే బాధ్యత మాది!'' మీనాక్షి కలగజేసుకుంది. తమ పరువు ప్రతిష్టలు ఇంక ఉండవని భయపడి... ఇతడికేం అమెరికా పోతాడు... ఉండవల్సింది తాము! ఆ కాపువాడ్ని ఆమెగారు కట్టుకుంటే తమ తలమీద వెంట్రుకలు పీకేస్తారు! తాము ముఖం ఎత్తుక తిరగడం మరి సాధ్యం కాదు! నాన్నకెంత పరువు తక్కువ!

"ఏదో సంబంధం దొరికింది కదా అని చంపా ఇష్టంలేకండా మెడలు వంచి పెళ్లి చెయ్యడం మాత్రం నా కిష్టంలేదు! మనం హాయిగా ఉన్నాం! దాని దాంపత్య జీవితం కూడా హాయిగా ఉండనినాడు నాన్న ఆత్మకి శాంతి ఉండదు ?" రామం అన్నాడు.

## 37

ఇంక అమెరికాకి వారం రోజులో వెళ్లి పోవాలనగా ఒక రోజున చంపాతో రామం అన్నాడు మృదువుగా... "చంపా! ఒక సంగతి అడగాలను కుంటున్నాను... ఏమీ అనుకోవు కద ?"

"అడుగన్నయ్యా! నువ్వు తప్ప నా బాగు కోరేవారెవరు ?" చంపా అంది నిశ్చలంగా అతడి కళ్లలోకి చూసి –

"నువ్వు అప్పారావుతో చనువుగా ఉండడం గురించి నలుగురూ నాలుగు విధాల అనుకుంటున్నట్టు విన్నాను – నీ నించి నిజం తెలుసుకోవాలని ఉంది..." సిగ్గు పడుతూ అడిగేడు – ఇది చాలా సున్నితమైన సంగతి!

చంపా ముఖం ఎరుపెక్కింది – సిగ్గుతో తల దించుకుంది... "అన్నాదమ్ములు చెల్లెలితో రోడ్డు పైన మాట్లాడితే వారి బాంధవ్యం తెలీనప్పుడు అపప్రచారం చెయ్యడానికి జంకని మనస్తత్వం మనుష్యులది – మా ఇద్దరి మధ్యా స్నేహభావం తప్ప మరే భావమూ లేదు!"

చెల్లెలు బాధపడిందని గ్రహించి ఆమెను ఓదార్చే భావనతో రామం అన్నాడు... "చూడు చంపా! ఓ సంగతి నీకు ఖచ్చితంగా చెప్పేస్తున్నాను! నేను వచ్చే వారం వెళ్లిపోతాను – మరెప్పుడు వస్తానో తెలీదు! నీ పెళ్లి విషయంలో నీకు పూర్తి స్వతంత్రం ఉంది! నీకు నచ్చిన మనిషినే తప్ప మరొకర్ని పెళ్లాడ్డం నా కిష్టంలేదు! మాలానే నీ జీవితం హాయిగా, సుఖంగా వెళ్లిపోవాలని నాన్నా అమ్మల కోరికా... నా కోరిక!" అంతకన్న సూటిగా మరేమీ చెప్పలేకపోయేడు రామం – అప్పారావంటే



# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రచయితలకు గమనికలు

★ ఆంధ్ర సచిత్ర వారపత్రికకు కథలూ ఇతర రచనలూ పంప దలచుకున్నవారు సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520 003 అన్న చిరునామాకి వ్రాయాలి.

★ కవరుమీద శీర్షిక పేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి– హామీ పత్రం జత చెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, ఇతర రచనలుగాని తిప్పి పంపబడాలని కోరుకునే వారు– వారి స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ల లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనే గాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటిపై నిర్ణయం కోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు కాని– తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు– రచన పేరు– అది పంపిన తేదీ, వివరంగా వ్రాయండే. వాటి గురించి పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామా గల తగినన్ని తపాలా బిళ్ల లంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్లు పంపేవారు కూడా 8 వారాలలోగా మా మీద ఉత్తరాల దాడి చెయ్యకూడదు... ప్రతి కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్ల కవర్సుపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ కార్టూన్ల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలు వెంబడి జరుగుతుంది.

★ రచయితలకు కార్టూనిస్టులకు ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పద్ద' వారికి తప్ప తతిమ్మా అందరికీ; అవి పద్ద "ప్రతు"లను– కాల క్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలోపోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. సం.

ఆమెలో కేవలం స్నేహభావమే ఉన్నప్పుడు, ఆమె మనసుని అటువేపు తిప్పదలచుకోలేదు రామం – తను ఒక నిర్ణయం ఆమెను తీసుకోమని ఒత్తిడి వేసినట్టవుతుంది...

అన్న మాటలకి కృతజ్ఞతతో చంపా కళ్లలో నీరు ఉబికింది... "నీ అభిమానం తెలుసన్నయ్యా! నా పెళ్లికిప్పుడు వచ్చిన తొందరలేదు! నీ మాటలు గుర్తుంచుకుంటాలే – లోకం అన్నాక ఎందరో ఎన్నో మాటలంటారు! వారలా అన్నారని మనం మనసులు పాడుచేసుకోనవసరంలేదు – బహుశా శ్రీనన్నయ్య ఏదో చెప్పి ఉంటాడు – నా పెళ్లి గురించి బాధ్యత వాళ్లమీద మాత్రం పెట్టకు! ఆ బాధ్యత నీది!" అన్న రామం భుజంమ్మీద చెయ్యివేసి అంది చంప... ఆ మాటలకి రామం కళ్లలో నీళ్లు తిరిగేయి –

"నీ మనసుకు నచ్చిన వ్యక్తి ఎదురైతే... లేదా నే చూసిన వ్యక్తి నీకు నచ్చుతే ఆనాడు నా చేతులమీదుగా నీ పెళ్లి జరిపిస్తాను! ఏది ముందు జరుగుతే అది – నేను మరోసారి నీకోసం లిల్లీతోకూడా ఈ దేశం వస్తాను నీ పెళ్లి జరిపించడానికి..." చంపా చేతులు పట్టుకొని వాగ్దానం చేసేడు రామం.

వారం తరవాత అమెరికా వెళ్లిపోయేడు... రామం –

నెల రోజుల తరవాత ఒక కేబిల్‌గ్రామ్ వచ్చి అశనిపాతంలా చంపా హృదయాన్ని తునాతునకలు చేసింది – ఆ కేబిలులో నాలుగే పదాలు... "రామం కారు ఏక్సిడెంట్‌లో మరణించేడు!" అటువంటి కేబిలే శాంతమ్మకి కూడా వచ్చింది – చంపా కుప్పగా కూలిపోయింది. ఆమెకు అతి చేరువ వ్యక్తులు ఇంత వేగంగా ఒకరూ ఒకరూ తెలియని హస్తం ఆడించే ఆటలో పావులుగా మారి జీవితరంగం నించి పోవడం, ఆమెనొక తెలియని అంధకార లోకంలోకి కుదేసినట్టయింది. ఆ మానసిక ఒత్తిడికి తట్టుకోలేక తెలివి పోగొట్టుక పడిపోయింది, మరీ లోకంలో లేని అన్నకోసం పెద్దకేక పెట్టి!

* * *

లాస్ ఏంజెలిస్‌కి మూటయాభై మైళ్ల దూరాన ఉన్న ఒక చిన్న పట్నంలోని ఒక స్నేహితుడి ఇంటికి అతడి ఆహ్వానమ్మీద వారింట జరిగిన వారి ఏడాది అబ్బాయి పుట్టిన రోజు పండగ పార్టీకి రామం ఒక్కడూ వెళ్లేడు – తొమ్మిదవ నెల నడుస్తున్న లిల్లీ వెళ్లలేకపోయింది.

గంటకి అరవై మైళ్ల వేగాన నడపగలిగే ఎక్స్‌ప్రెస్ హైవేలవి. వెళ్లడానికి రెండున్నర గంటలు, తిరిగి రావడానికి రెండున్నర గంటలు – పార్టీ పూర్తయ్యేసరికి రాత్రి పదయింది – రామం ఎప్పుడూ నిషా పదార్థాలు ముట్టుకోడు – కంపెనీకి అప్పుడప్పుడు బీరు మాత్రం తాగుతాడు – తక్కిన వారంతా పది దాటినా ఇంకా ఉండగా, భార్య పరిస్థితి చెప్పి, రామం వారి దగ్గర శెలవు తీసుకొని బయల్దేరేడు – కారు హైవేమీద ప్రయాణం చేస్తోంది అరవై మైళ్ల వేగాన. తను పార్టీలో

ఉన్నప్పుడు బాగా ఒక గంట వర్షం పడి వెలిసినట్టు పార్టీ పూర్తయాక కాని తెలిసిరాలేదు.

రోడ్డు నీటితో తడిసి నల్లతామలా మెరుస్తోంది — రామం మనస్సులో లిల్లీ గురించి ఆలోచనలు. ఏ క్షణమైనా ఆమెని హాస్పిటల్‌లో పురిటికి చేర్చవలసి ఉంటుంది — తనకి ఈ పార్టీకి వెళ్ళడానికి ఇష్టం అట్టే లేకున్నా, తనతోబాటు రీసెర్చి చేస్తున్న ఆ మిత్రుడ్ని నొప్పించడం ఇష్టం లేకపోయింది — అబ్బాయి వినోద్ ఈసరికి నిద్రపోతూ ఉంటాడో లేక డాడీ లేడని అల్లరిచేస్తూ ఉంటాడో — తను నిద్రపుచ్చుతేనే కాని వాడు పడుక్కోడు — అబ్బాయికి ఇంగ్లీషులో మాట్లాడ్డమేకాక తెలుగులో మాట్లాడ్డం కూడా పట్టుబడింది — చిన్ననాడు తనకి నాయినమ్మ చెప్పే కథలన్నీ మూడేళ్ల వినోద్‌కి తను చెప్పేవాడు — అందువల్ల చెప్పిన కథే అయినా ఒక కథ చెప్తేనే కాని వాడికి నిద్ర రాదు — ఆ నిద్రలో రాజులూ, రాణులూ, రాక్షసులని చంపడం వాడు కలలు కంటాడు.

తిరుగు ప్రయాణం రెండు గంటలు సవ్యంగా నడిచింది — మరో అరగంటలో తన ఇల్లు చేరుకో వచ్చు. తను కొత్తగా కొన్న ఈ బ్యూక్ కారు రేసుగుర్రంలా దూసుకపోతోంది.

అప్పుడు వెనకనించి వస్తున్న మరొక కారుకి సైడివ్వడానికి కారుని కాస్త పక్కకి తియ్యబోగా వర్షంపడి ఉండడంవల్ల కారు స్కిడ్ అయినట్టని పించి, బ్రేక్ కొట్టేడు — బ్రేక్ కొట్టగానే ఒక మిజైల్‌లా వెనుక వస్తున్న కారు బంపరు రామం కారు వెనుక భాగాన్ని ఒక పక్కకి ఢీకొంది — బ్రేక్ కొట్టడంవల్ల, వెనక కారు గుద్దడంవల్ల, రామం బ్యూకు రెండు పల్టీలుకొట్టి తిరగబడింది — స్టీరింగు చక్రం రామం గుండెని సీటుకి నొక్కేసింది. అతడి ప్రాణం వెంటనే పోయింది — హైవే పెట్రోలు పోలీసువారేకాక, అటు వెళ్తున్న కారులు ఆగేయి — కారులోంచి రామం శరీరం తీసి హాస్పిటల్‌కి తీసుకవెళ్లడం కేవలం ఫార్మాలిటీ అయింది — అతడెవరో తెలుసుకున్నాక... తమ హాస్పిటల్‌లో నర్సుగా పనిచేసే లిల్లీ భర్త అని హాస్పిటల్‌వారు గుర్తుపట్టాక, అతి విచారంగా ఆ సంగతి లిల్లీకి తెలియజేసేరు.

భర్త ఏ క్షణమన్నా తిరిగి రావచ్చని, నిద్ర పోకుండా ఏదో పుస్తకం చదువుకుంటున్న లిల్లీ... కారు చప్పుడవడంతో తలుపు తీసుక బయటకు వెళ్లింది — కాని బయటనున్నది, తనని ఎమర్జెన్సీ డ్యూటీ ఎప్పుడన్నా పడితే వచ్చి తీసుకవెళ్లే ఏంబ్యులెన్సు... తమ హాస్పిటల్‌ది. తానిప్పుడు మెటర్నిటీ శెలవుమీదుంది ? ఈ ఏంబ్యులెన్స్ ఎందుకు వచ్చింది ? అందులోంచి దిగిన హెడ్‌నర్స్ లూసీని చూడగానే లిల్లీ అనుకుంది, తనని చూసేందుకు, ఒకవేళ పురిటినొప్పుల అనుమానం ఉంటే తనని హాస్పిటల్‌లో చేర్చేందుకామె వచ్చిం దేమోనని — రామం ఆమెకి ఫోన్ చేసాడు కూడా ఇవాళ మధ్యాహ్నం... తను పక్కూరు వెళ్తున్నట్టూ, ఓసారి వచ్చి లిల్లీని చూసివెళ్లమనీ తీరికుంటే — లూసీకి నలభై ఏళ్లు — భర్తా, పిల్లలూ ఆనంద మైన సంసార జీవితం ఆమెకే చింతా లేకుండా చేసేయి — భారతీయులన్నా, నెహ్రూ అన్నా ఆమె కిష్టం — అందువల్ల ఆమెని ఎన్నోసార్లు పార్టీలకీ, భోజనాలకీ లిల్లీ తమ ఇంటికి ఆహ్వానించడం పరిపాటయింది. వినోద్‌కి ఆమెవద్ద చనువు ఏర్పడింది. ఆమెకి దోసెలూ, ఇడ్లీలూ, సాంబారూ మొదలైన వంటలంటే ఇష్టం కలగజేసేరు — అవి ఎలా చెయ్యటమో కూడా ఆమెకు నేర్పేరు...

"గుడ్ ఈవినింగ్ లూసీ ! ఏమిటిలా వచ్చేరు ? రండి... రండి!" అంటూ చిరునవ్వుతో పలకరించ బోయిన లిల్లీ, లూసీ ముఖంమీద విషాదచ్ఛాయలు గమనించి... "ఏమయింది... అలా ఉన్నారు ?" అంటూ ఆత్రంగా అడిగింది.

ఈ వార్తని తెలియజేసి, తరవాత ఆమెను హాస్పిటల్‌కి తీసుకవెళ్లడం మంచిదా, లేక ముందు హాస్పిటల్‌కి తీసుకవెళ్లి ఈ వార్త చెప్పడమా అని నిర్ణయించుకోలేని లూసీ... గబుక్కున అనేసింది... "లిల్లీ ! రామం కారుకి ఏక్సిడెంటయింది... రామం పరిస్థితి ప్రమాదంగా ఉంది... నాతో వెంటనే హాస్పిటల్‌కి రా!" అంటూ లిల్లీని దగ్గరకు తీసుకుంది —

ఈ వార్త కలిగించిన ఉద్వేగానికి లిల్లీ తట్టుకోడం కష్టమయింది. ఆమె క్షణకాలం నమ్మలేకపోయింది — నో ! నో ! ఇది నిజం కాదు ! అబద్ధం ! తనకీ రామంకీ ఏ ఆపదా రాదు ! అనుకుంది — కాని ఎదురుగా ఉన్న లూసీని చూసి ఆమె నోటంట విన్న ఈ వార్తని ఎలా కాదనుకోడం ! "ఏమిటి మీరన్నది ? ఇది నిజం కాదు...! ప్లీజ్ ఇది నిజం కాదని చెప్పండి !" అంటూ ఆమెను పాదవి పట్టుకుంది. అగాధంలోకి పడిపోతున్నట్టు అనిపించగా ఒంట శక్తిలేక కూలిపోయిన లిల్లీని స్ట్రెచ్చర్‌మీద హాస్పిటల్‌కి తీసుకవెళ్లవల్సివచ్చింది సరాసరి మెటర్నిటీ వార్డుకి — వినోద్‌ని పక్కింటి వారికి అప్పగించడం జరిగింది.

పురుడు వచ్చింది — మగబిడ్డ పుట్టాడు — ఆమెకి మత్తుమందిచ్చి నిద్రపుచ్చారు — ఈ మధ్యని రామం శరీరానికి పోస్ట్‌మార్టమ్, పోలీసు ఫార్మాలిటీస్ అయ్యాక లిల్లీ తరపున లూసీకి అప్పగించారు — బాడీని మార్గ్‌లో ఉంచడం జరిగింది. రామం పని చేస్తున్న కాలేజీ నించి ఈ సంగతి తెలిసి లెక్చెరర్లు, ప్రొఫసర్లూ వచ్చేరు — తమ సానుభూతి ఎవరికి వ్యక్తంచెయ్యాలో తెలియక లూసీకి వ్యక్తం చేసేరు.

(ఇంకా ఉంది)

# కమ్మదనం... సంతృప్తి – వీటి అరుదైన కలయిక...




EXPORT QUALITY

# గోల్డ్

## దీనికి సాటి మరొకటి లేదు

CHARMINAR
GOLD
FILTER

మీకు కొనడానికి ఎన్నో రకాల సిగరెట్లు ఉన్నాయి. కొన్ని కమ్మదనాన్ని, మరికొన్ని తృప్తిని ఇవ్వవచ్చు. కాని ఈ రెంటినీ ఇచ్చేది గోల్డ్ ఒక్కటే. కమ్మదనం, సంతృప్తి– ఈ రెంటి అరుదైన కలయిక గోల్డ్. గోల్డ్‌కు సాటి మరొకటి లేదు.

రూ. 2·75 కు 20
స్థానిక పన్నులు అదనం
CASVS-244-234

చట్టబద్ధమైన హెచ్చరిక: సిగరెట్ తాగడం ఆరోగ్యానికి హానికరం
STATUTORY WARNING: CIGARETTE SMOKING IS INJURIOUS TO HEALTH

మెయిన్ డీలర్: M/s. శ్రీ లక్ష్మి ఎంటర్‌ప్రైజెస్, వుయ్యూరు–521165.

''మాగ్జైన్''ల లోకం మీద

## భారత్ - అమెరికా 'గుండ్రబల్ల' చర్చావేదిక !

**''అమెరికాలో సచిత్ర వార, మాస పత్రికలకి టెలివిషన్ ఒకటి గట్టి పోటీ యిస్తున్నది. 60 వేల దాకా మాగజైన్‌లున్నాయి కాని ''ఫ్రీలాన్సర్''గా బ్రతకగలిగే జర్నలిస్టులు 200 మంది మాత్రం వున్నారు ''—**

రేపు వొచ్చే ఏప్రిల్ నాటికి 43వ వసంతంలో అడుగుపెడుతున్న డా ఫ్రెడ్ కె పెయిన్ అమెరికన్ మాగజైన్ జర్నలిజంమీద ఫొటోగ్రాఫీ మీద అథార్టీ జనవరి 22 – 23 తేదీలలో మద్రాసు కన్నెమరా హోటలు 'వాలాజా' హాలులో జరిగిన ''ఇండో – అమెరికన్ సచిత్ర పత్రికల గుండ్రబల్ల'' సమావేశంలో – దక్షిణ భారతదేశపు భాషా పత్రికల, ఆంగ్ల పత్రికల కలివిడి సమావేశంలో ఆయన చెప్పిన సంగతులివి! ప్రొఫెసర్ పెయిన్ 1800 దాకా ఫొటోలు తీసి పత్రికలలో వేశారు అయోవా రాష్ట్రంలోని డెస్‌మొయినిస్ లో గల డ్రేక్ యూనివర్సిటీలో జర్నలిజం శాఖాధిపతి సప్త సంవత్సరాంతపు సరవాశలవులమీద కుటుంబ సమేతంగా భారతదేశం వచ్చారు అమెరికన్ సెంటర్ వారి ఆధ్వర్యంలో యేర్పాటైన యీ ''రౌండ్ టేబుల్'' మట్టూరా శ్రీ ఫ్రెడ్‌తో పరస్పర విషయ సేకరణాసక్తితో చర్చలు చేసిన మాగజైన్ ప్రతినిధులలో శ్రీయుతులు జి త్యాగరాజన్, ఏ యస్. రామన్, శ్రీమతి మాలినీశేషాద్రి మాత్రం ''ఫ్రీలాన్స్'' జర్నలిస్టులు

# 'సచిత్ర' పత్రికలమీద పెరుగుతున్న మోజు !

తతిమ్మా 26 మంది కూడా కేరళ, తమిళ, కన్నడ, తెనుగు, ఆంగ్ల భాషా పత్రికలలో ప్రాచుర్యం, ప్రాముఖ్యం వున్నవని నిర్వాహకులు భావించిన పత్రికల సంపాదకులు, లేదా కార్యనిర్వాహక సంపాదకులూను

సన్నంగా పొడుగ్గా ఉత్సాహంగా కనపడే డా ఫ్రెడ్ అక్కడ పత్రికలు పనిచేసే తీరుతెన్నులమీద విపులంగా చెప్పిన తర్వాత – ''అక్కడి పత్రికలలో కూడా ప్రకటనలకి, పాఠకులకు అందించే యితర 'సరకు'కి మధ్య సమన్వయం సదుపాయం చేయడం పత్రికల నిర్వాహకులకు నిరంతర పోరాటంగానే వుంటూవున్నదని అర్థమైంది మన పత్రికలలో ''కథ''లు ప్రథమ తాంబూలం అందుకుంటే వాళ్ల పత్రికల్లో ''వార్తా కథలు'' పాఠకులకు యిష్టం ముఖచిత్రం, 'మధ్య పేజీలు – వాటిమీద రంగుల బొమ్మలు యివిగాక ముఖచిత్రంమీద లోపలి విశేషాల హంగులు కూడా అక్కడా యిక్కడ మామూలే . అన్నింటికన్న అక్కడి పాఠకులకి యిష్టమైన పత్రిక సైజు ''ఆంధ్ర సచిత్ర వార పత్రిక'' సైజే – ''లైఫ్'' పత్రిక సైజు కూడా యిష్టమేగాని అంత గొప్పగా ఒక పత్రిక వున్నప్పుడే అది రాణిస్తుంది! అచ్చు వెయ్యడం కోసం అక్కడ మనకన్నా చాలా అధునాతనమైన పద్ధతులున్నాయి.. అచ్చు వేయించడం పెద్ద సమస్య కాదు వాళ్లకి... కాకపోతే అమ్మకాల పద్ధతిలో తేడా వుంది – పత్రికలను వేర్వేరు ప్రాంతాలకి పెద్ద పెద్ద బంగీలుగా రవాణా చేసి మళ్లీ ఆయా ప్రాంతాలలో విడివిడిగా తీసి పంపిణీ చేస్తారు కొందరు. '' — లాంటి ఎన్నో విషయాలు తెలిశాయి..

డా ఫ్రెడ్. కె పెయిన్ మరొక తమాషా చెప్పారు. కొన్ని పత్రికల వాళ్ళు ఒకే ''వారం'' వేర్వేరు ముఖ చిత్రాలను వేసి ఆయా ప్రాంతీయావసరాన్నిబట్టి ఒక్కోమాదిరి ''ముఖ చిత్రం'' కుట్టి కూడా అమ్మకాలను ఎక్కువ చేస్తూంటారుట! 'పత్రిక'లలో బొమ్మలు మాటలు కూడా సందర్భాన్నిబట్టి అలంకారాలుగా రాణిస్తాయి ఉదాహరణకి ''చంద్రమండల శకటం'' లాంటి దానిమీద ఎంత రాసినా పాఠకుడికి తెలియదు ఓ 'బొమ్మ'



''రౌండ్ టేబుల్'' ఆహ్వాన పత్రిక

A ROUND TABLE

పడేస్తే చాలు! అయితే ప్రతీసారీ వ్యాసానికి కథకి అవసరమైన ఫొటోలు తీయించగల స్తోమత అమెరికాలో వున్నట్లు మన పత్రికలకి ఉండదు కనుక – భారతీయ పత్రికలకన్నా ''ఫొటో''ల అలంకరణలో అమెరికన్ మాగజైన్‌లు ముందడుగు వేశాయి ! —

### కార్టూన్‌ల మాట

ఫ్రెడ్. కె. పెయిన్ టీచర్ కనుక విడిగా కూడా ఆయనతో మాట్లాడుతున్నప్పుడు మన ప్రశ్నలకి విపులమైన వివరణలు దొరుకుతాయి – తనకు తెలియని విషయాలమీద మాత్రం ఆయన ''స్పష్టంగా తెలీదు'' అంటారు ''కార్టూన్''లు మన పత్రికలలో యిప్పుడు ప్రత్యేక స్థానాన్ని పట్టుకున్నాయి అమెరికాలో యీ మాదిరి ''సంపాదకపక్షపు కార్టూన్''ల పిచ్చి లేదుట ''అయినా యీ కార్టూన్‌ల వ్యవహారం నాకంతగా తెలియదు'' అన్నారాయన. అన్ని రకాల పాఠకులకి వేర్వేరు రకాల ప్రత్యేక పత్రికలు వుండే అమెరికాలో నల్ల అమెరికన్‌లకి, వలస తెల్లవారికి (ఫ్రెంచ్, ఇటాలియన్, స్పానిష్) కూడా వాళ్ల వాళ్ల పత్రికలున్నాయి, అన్నమాట విని ''మరి రెడ్ ఇండియన్''లకి వాళ్ల ప్రాచీన భాషలో లిపిలో పత్రికలేమైనా వస్తున్నాయా ? అని అడిగాను .. ''ఒక్కటో, అరో వుండాలిగాని ఎంచేతో వాళ్లు యీ విధంగా పత్రికల ద్వారా వారి సంస్కృతిని ప్రాచీన నాగరికతని కాపాడుకోవాలనుకోటం లేదేమో అనిపిస్తుంది'' అన్నారు డా. పెయిన్.

మద్రాసు అమెరికన్ సెంటర్ డైరెక్టర్ శ్రీ క్రిస్టోఫర్ యల్ షోల్స్ లోగడ 'అమెరికన్ రిపోర్టర్' పత్రిక నిర్వహించిన సంపాదకుడు. గొప్ప సరదా వనిషి కొంచెం ఫొటోగ్రాఫర్ కూడా. 'గుండ్రబల్ల' సమావేశాన్ని గడియారం ముళ్లకి అనుగుణంగా, విషయానురక్తిని సరసంగా కొనసాగేలా కాపాడిన గడుసుతనం శ్రీ షోల్స్‌దే.. ''ఎ సైడ్'' పత్రిక సంపాదకుడు శ్రీ అబ్రహామ్ యిరాలీ చర్చలకి చైర్మన్‌గా కూర్చున్నారు. రెండు రోజులపాటు విదేశీ పర్యాటకులు ప్రముఖులు, బస చేసే 'కన్నెమరా'లో 'దేశవాళీ' వాసనలకి కొంచెం దూరంగా జరిగిన యీ ''గుండ్రబల్ల'' సమావేశాలలో యు ఎస్ ఐ యస్ కి చెందిన శ్రీయుతులు బి యస్. ఆర్ కృష్ణ, కె ఏ సుబ్బయ్య, వెంకటకృష్ణన్, శ్రీనివాసన్ మొ॥గువారి సహకారంతో ''మాగజైన్''ల ప్రతినిధులంతా ఆనందంగా పాల్గొనకలిగారు. ''అక్కడి యిక్కడి పత్రికలమీద కొంత తెలియజేశాం కొంత తెలుసుకున్నాం'' అన్నారొక ప్రతినిధి. ఔను !

[ వీరాజీ ]

# మనోనేత్రం




## కప్పగంతుల మల్లికార్జునరావు

'రామా నిన్నే నమ్మితీ... రఘురామా నిన్నే నమ్మితీ... చక్కని దొరవాని రామా.. రఘురామా . శ్రీరామా. నిన్నే నమ్మితీ ..'

పాటనిండా అపస్వరాలు — అపభ్రంశ శబ్దాలు. అయినా భక్తి పారవశ్యంతో పాడే ఆ పాట వినగానే 'కోతి... కోతి' అంటూ పిల్లలు యిళ్లల్లోనుంచి బిలబిలా బయటికొచ్చి ఆంజనేయస్వామి చుట్టూ మూగేరు.

'అబ్బ ! కొత్తగా వున్నాడ్రా ఆంజనేయస్వామి? ఎన్ని నగలో ? అవన్నీ రాములవారు యిచ్చారా స్వామీ ?'

ఆంజనేయస్వామి వేషంలో వున్న రాములు 'అవును' అన్నట్టు నవ్వుతూ తల వూపేడు. సీతమ్మవారిని చూపమని, ఆకాశంలోకి ఎగరమని పిల్లలు కోరికలు కోరుతున్నారు. కొందరు తోక పట్టుకోవాలని ప్రయత్నం.

రాములు ఆంజనేయస్వామి వేషం వేసుకొని ఏ వీధిలోకి వస్తే ఆ వీధి పిల్లలకి సంబరం. పిల్లలు చుట్టూ మూగితే రాములికి సంబరం.

అందులోనూ యీ వేళ కొత్త డ్రెస్సులో మిలమిలా మెరిసిపోతున్నాడు. పిల్లలు వేషాన్ని పొగిడితే వుబ్బిపోతున్నాడు. శ్రీరామ పట్టాభిషేకం పటంలో ఆంజనేయస్వామి కళ్లముందు మెదిలేడు ఉత్సాహం పరవళ్ళు తొక్కింది ఆంజనేయస్వామిలా ఎగిరేడు భక్తి పారవశ్యంతో పాటలు పాడేడు చిందులు తొక్కేడు కుప్పిగంతులువేస్తూ తిరగా లనుకొన్న వీధులన్నీ తిరిగేడు

సూర్యుడు నడినెత్తిమీదికొచ్చే వేళకి కడుపు కరకరలాడింది చేతికి వ్రేలాడే సంచీ బియ్యంతో నిండిపోయి బరువెయ్యసాగింది. స్వెట్టరుకు కుట్టించిన దొంగజేబులో చిల్లరడబ్బులు గిలిగింతలు పెట్టేయి.

'అవ్వా ! ఆకలేస్తోంది. తొరగా అన్నం పెట్టు '

గుడిసెలోకెళ్లి సంచీ వో మూలపెట్టి దుస్తులు విప్పుతుండగా అవ్వ వచ్చింది.

'సంపాదన బాగున్నట్టుందే వుషారుగా వున్నావ్ ?' సంచీ చూస్తూ అంది.

'డ్రెస్సు మహిమ అవ్వా' అంటూ డబ్బు లెక్కపెట్టేడు 'యిదిగో అవ్వా డబ్బు బియ్యం అవిగో జాగ్రత్త చెయ్యి'

నగలు తీసి జాగ్రత్త చేసేడు. కొబ్బరినూనెతో రంగు కడిగేసుకొంటుండగా అవ్వ అంది 'తొరగా పెళ్లి చేసుకోరా అబ్బీ. మగాడు వూరు తిరిగి ఎంత సంపాదించుకొస్తే మాత్రం ఏం నాబం ? యింటి కొచ్చేసరికల్లా ఆడది ఎదురుపడ్తేనే ఆనందం పెళ్లాం అంబలిచ్చినా అమురుతంనాగే వుంటుంది ఏమంటావ్ ?'

సిగ్గుపడుతూ స్నానానికెళ్లేడు. పెళ్లి తనకు పెళ్లి...

యిన్నేళ్ల బ్రతుకు వొంటిమీదపడ్డ నీళ్లలా జారిపోయినట్లనిపించింది. వెనక్కి వెళ్లి జీవితాన్ని తవ్వుకోక తప్పలేదు.

*　　*　　*

వుడుతూనే రాములు 'అనాకారి' అన్న బిరుదును బొడ్డుకు తగిలించుకువచ్చాడు. పురుడు పోసిన మంత్రసాని 'పిల్లవాడిని చూచి కోతిపిల్లనుకొని భయపడ్డానంటే నమ్ము పిన్నమ్మా' అంటూ వూరంతా ప్రచారం చేసివచ్చింది.

అంజమ్మ తపఃఫలం రాముడు. ఆమె సాధ్వి మహాభక్తురాలు. శ్రీరామ పట్టాభిషేకం బొమ్మ ముందు కూర్చుని ఎప్పుడూ రామభజన చేసేది

[illegible] ఏళ్ళు పుట్టకపోగా ఆంజనేయస్వామికి ప్రదక్షిణాలు చేసింది వో రోజు ఆంజనేయస్వామి పూనేడు ఆమెను 'రాములవారు నిన్ను అనుగ్రహించారు నీకు కొడుకు పుడ్తాడు' అంది భర్తతో అంత రామభక్తి — ఏకాగ్రత! ఆమె అన్నట్లే సంవత్సరానికి బిడ్డపుట్టేడు. 'రామ ప్రసాదం నా బిడ్డ' అంటూ పిల్లాడిని చూచుకొని మురిసిపోయింది అంజమ్మ వొక్కతే.

'నయం. ఆడపిల్లను కన్నావుకాదు. మగపిల్లవాడు ఎలాగున్నా ఎలాగోలాగు బతక్కపోడులే' అన్నాడు అంజమ్మ భర్త వెంకటేశు.

వెంకటేశు జీవనాధారం వొంటెద్దు బండి ఆ వూరికి రైలుస్టేషను నాలుగు మైళ్ళు వూరునుంచి రైలుకెళ్ళే వాళ్ళను పొద్దున్నే తీసికెళ్ళి రైలు దిగిన వాళ్ళను తీసుకొస్తాడు మళ్ళీ. అవసరాన్నిబట్టి ఎక్కువ ట్రిప్పులు తిరగటం, లేకపోతే వొట్టి బండే పోయి రావటం.

సంపాదించిన దాంట్లో వెంకటేశు యింటి ఖర్చుకిచ్చేది చాలా తక్కువ. డబ్బు చేతిలో వుంటే అతను పూలరంగడే. తాగుతాడు. ముండపున్నట్లు చెప్పుకొంటారు అయినా అంజమ్మ యివన్నీ పట్టించుకోదు. డబ్బున్నవాళ్ల యిళ్లల్లో పనిచేసి సంపాదిస్తుంది రాముల మొదటి నుంచీ తల్లి చాటు బిడ్డే!

'ఒరేయ్. రాములుగాడు అచ్చం హనుమంతుడిలా వుంటాడుగదూ?' ఎవడో అన్నడొకసారి అప్పటినుంచి 'హనుమంతు' అన్నపేరు పడింది రాములికి ఆ పేరుతో పిల్లలంతా తన్ని పిలిచేకొద్దీ హనుమంతుడంటే ద్వేషం, అసహ్యం ఏర్పడింది అతనికి పిల్లల్ని తప్పించుకు తిరిగేవాడు బడికిపోతే పిల్లలు ఎగతాళి చేస్తారని భయం. చదువుకు దూరమయ్యేడు.

'అమ్మా. హనుమంతుడంటే ఎవ్వడే ?'

శ్రీరామ పట్టాభిషేకం బొమ్మలో రాముల వారి పాదాల చెంతకూర్చున్న బొమ్మను చూపింది అంజమ్మ.

'హనుమంతుడన్నా, ఆంజనేయస్వామి అన్నా ఆయనే. పెళ్ళికూడా చేసుకోకుండా సీతారాములకి సేవచేసిన రామభక్తుడు గొప్ప బలశాలి. సంజీవి పర్వతాన్ని చిటికెన వేలితో ఎత్తేడు. అయినా తన బలం యితరులు చెప్తేకాని తెలీదు రామభజనే ఆయన తపస్సు.'

తల్లిచెప్పిన మాటలేం రుచించలేదు రాములికి అసలు అర్థం చేసుకోలేదు 'నేను హనుమంతుడిలా కోతిలాగుంటానా ? నన్ను అంతా అలా ఎగతాళి చేస్తారేం ?' జాలిగా అన్నాడు

'తప్పు. ఆంజనేయస్వామి గొప్ప అందగాడు. ఆయన్ని 'కోతి' అంటే కళ్ళుబోతాయి.'

స్నేహితులెవరికీ కళ్ళుపోలేదు. అంచేత తల్లి మాటలపై రాములికి విశ్వాసం కుదరలేదు.

ఒకసారి రాములు తండ్రితోపాటు బండిలో రైలుస్టేషనుకు వెళ్ళేడు చదువురాక పోయినా బండైనా తోలుకొని బతుక్కపోతాడా ? అక్కడ వెంకటేశు అరటిపండ్లు కొనిచ్చి బండి కట్టేసి రానటానికి వెళ్లేడు స్టేషనులోకొచ్చిన గూడ్సు బండిని చూస్తూ అరటిపండు తింటుండగా, ఎక్కడినుంచి వొచ్చిందో కోతి అరటిపండ్లను లాక్కొంది. హఠాత్తుగా కోతిని చూచి 'కెవ్వు' మన్నాడు రాములు. ఎలాగు తడుపుకొన్నాడు. జ్వరం వచ్చింది రాత్రికి.

'జడుపు జ్వరం. ఆంజనేయస్వామి దండకాన్ని చదువుతాను, విను జ్వరం చిటికెలో తగ్గిపోతుంది' తల్లి చదివిన దండకాన్ని విన్నాడు ఆమె కుంకుమ మొహాన పెడ్తే పెట్టించుకొన్నాడు. అయినా జ్వరం తగ్గదనే అతను నమ్మేడు అలాగే జరిగింది తల్లి మాటలమీద, దేముడిమీద విశ్వాసం యింకా తగ్గింది

మరోసారి బండిలో రైలుస్టేషను నించి వస్తున్నాడు. బండి ఖాళీగా వుంది. తండ్రి తాగి బండిలో పడుకొన్నాడు. రాములే బండి తోలుతున్నాడు. చీకటిపడింది. మధ్యలో వున్న మామిడి తోటలో దయ్యాలున్నాయని చెప్పుకోటం రాములు చాలాసార్లు విన్నాడు బండి తోటలో కొచ్చేసరికి భయం వేసింది. అంతలోనే చెట్టుచాటునుంచి ఏదో నల్లటి ఆకారం బయటికి రావటం చూచాడు దయ్యమన్న భ్రమ — భయం! కెవ్వుమని కేకపెట్టి కిందకి దొర్లేడు. కాలు చక్రంకింద పడి నలిగింది.

అప్పుడూ ఆంజనేయస్వామి దండకాన్నే చదివింది అంజమ్మ. 'స్వామి అంటే దయ్యాలు భూతాలకు భయం. ఆయన్నే తల్చుకొంటూ పడుకో భయం నీ దగ్గరికి రాదు.'

కానీ రాత్రంతా దయ్యాల భూతాల భయంతోనే గడిచిపోయింది రాములికి ఆంజనేయస్వామిని వొక్కసారన్నా తల్చుకోలేదు.

అసలే అనాకారి అందుకుతోడు కాస్తంత గూని యిప్పుడీ ప్రమాదంతో కాలు అవిటిదయింది కాలు ఎత్తి ఎత్తి వేస్తుంటే చూచేవాళ్లకి చిత్రంగా వుండేది. బండి ఎక్కనని భీష్మించాడు.

బండి తోలటం కాక వెంకటేశుకు చాతయిన విద్య మరొకటుంది దీపావళికి జరిగే సంబరంలో నరకాసురిడి వేషం కట్టటం. నరక చతుర్దశినాడు తెల్లవారుఝామున వేషాలు కట్టి యుద్ధం చేసేవారు. వో బండిలో కృష్ణుడు సత్యభామ—వరో బండిమీద నరకాసురుడు, అతడి సైన్యం. ఊరంతా వూరేగి రెండు బండ్లూ ఎదురెదురుపడేవి వొకచోట కృష్ణుడు, నరకాసురుడు కాసిని పద్యాలు పాడేవారు. నరకాసురుడి బాణానికి కృష్ణుడు మూర్ఛపోయేవాడు. ఆ తర్వాత సత్యభామ, నరకాసురుడు పద్యాలు పాడేవారు చివరికి సత్యభామ బాణం తగిలి 'హా' అంటూ చచ్చిపోయేవాడు నరకాసురుడు.

నరకాసురుడు వేషం వెంకటేశుకు యిష్టం. అచ్చం నరకాసురుడిలాగే వుండేవాడు. బొంగురు గొంతుతో పద్యాలు పాడూ మాటి మాటికీ 'హ్హా హ్హా హ్హా' అని నవ్వుతుంటే పిల్లలకు భయం వేసేది. ఆ వేషానికి డ్రస్సు అతని స్వంతండికూడా

'మీ నాన్న నిజంగా చనిపోయాడ్రా ?'

తండ్రి చనిపోయినట్లే పడిపోయి, లేచివచ్చి యింట్లో వేషం విప్పేసి, బండి కట్టుకొని స్టేషనుకు వెళ్లటం చిత్రంగా వుండేది రాములుకు!

'ఒరేయ్. నువ్వెలా బ్రతుకుతావురా. వేషాలెయ్యటమన్నా నేర్చుకో.'

తండ్రి బలవంతంమీద వో దీపాళికి రాములువ కూడా వేషం కట్టేడు. నరకాసురుడి సైనికుల్లో వొకడు.

'హనుమంతాయ్‌గాడు రాక్షసుడి వేషంలో బాగున్నాడ్రోయ్. ఆంజనేయస్వామి వేషం కడ్తే యింకా బాగుంటాడు. కదురా?' బండెక్కుతుంటే ఎవరో పిల్లలు ఎగతాళి చేశారు.

సత్యభామ బాణానికి మూర్ఛబోయాడు వెంకటేశు. కాని అలవాటుగా మళ్లీ లేవలేదు రాములుకు మిగిలించిపోయింది నరకాసురుడి డ్రెస్ మాత్రమే!

* * *

కొడుకు ఆర్జించటంలేదన్న దిగులుకన్నా వాడి కెలాగోలాగ పెళ్లి చేయాలన్న ఆరాటం పట్టుకొంది అంజమ్మకు. వారినీ వీరిని పిల్లనడిగి లేదనిపించుకొంది. పైగా కొడుకు రూపాన్ని హేళన చేయటం భరించలేకపోయింది. మొట్టమొదటిసారి కొడుకు పుట్టుక పట్ల అసహ్యం, అతడి చేతకాని తనానికి కోపం వచ్చింది ఆమెకు.

'ఛీ! ఏం పుట్టుక ? ఏం బ్రతుకు ?'

రాములుకు రోషం వచ్చింది అందరూ తననవే మాటలు అతడికి తెల్సు. పుట్టుకతో వచ్చిన లోపాన్ని ఎలాగూ సరిదిద్దుకోలేడు కానీ కనీసం సంపాదనన్నా చేస్తే కొంత విలువ వస్తుంది గదా?

కూలి పనికి సిద్ధమయిపోయాడు.

'అసలే లొట్ట మనిషివి అమ్మ గారాబం చెరిచింది యిక నువ్వేం పనిచేస్తావ్ ? మాకూ్కూలి దండుగ తప్పితే. వెళ్ళు వెళ్ళు'

శరీరంలో శక్తి వున్నంతవరకు అంజమ్మ కొడుక్కు ఏలోటూ చేయలేదు. ఆమె మూలపడ్డాక ఆకలి ఆ యింట తిష్టవేసింది. 'రామా — శ్రీరామా ...' ఆ నామ జపంతో ఆమె ఆకలి బాధను మర్చిపోయింది!

'ఒరేయ్ రాములూ . దిక్కులేని వారికి ఆ శ్రీరామచంద్రుడే దిక్కు. స్వామిని నమ్ముకో' శ్రీరామ పట్టాభిషేకం బొమ్మ కొడుకు చేతుల్లో వుంచి అంది అంజమ్మ చివరి ఘడియల్లో.

'నువ్వు నమ్ముకొన్నావుగా? నీకేం వొరిగింది?'

## ఎలా వుంటుంది?

నీరులేని చోట
 చెరువెలా వుంటుంది ?

కృషిలేని మనిషికి
 గెలుపెలా వుంటుంది ?

పాలులేని నాడు
 పెరుగెలా వుంటుంది ?

కాళ్ళులేని నాడు
 పరుగెలా వుంటుంది ?

వానలేని చోట
 వరదెలా వుంటుంది ?

మనసులేని మనిషి
 మనుగడెలా వుంటుంది ?

— కొల్లు రంగారావు



తెలుగు కవులు డా. పురిపండా, శ్రీశ్రీగార్ల గౌరవార్థం ఇటీవల లండన్ కామన్వెల్తు ఇన్‌స్టిట్యూట్‌వారు జరిపిన సభలో శ్రీశ్రీ, పురిపండా, ముఖ్య అతిథి–ప్రఖ్యాత ఆంగ్లకవి జార్జి బార్కర్.

# మనోనేత్రం

'విశ్వాసం మనశ్శాంతికి మూలంరా. నా మనస్సుతో, ఏకాగ్రతతో నేను దేముడిని చాలాసార్లు చూచాను. అందరికీ అన్నీ యిస్తే నేదేముడున్నట్టా? పిచ్చివాడా. ఏమిలేని మనలాంటి వాళ్లకు ఆ విశ్వాసం బాధల్ని మర్చిపోవటానికి వో మార్గంరా' తల్లి మాటల్ని అర్థం చేసుకొనే శక్తి రాములుకేదీ ?

అంజమ్మ చావుతో ఆ కాస్త ఆధారం పోయింది. ఆకలంటే భయం ... దేముడంటే కోపం. ఆకలి భరించలేనప్పుడు దేముడిని తిట్టే తృప్తి ! ఊరడించే వాళ్లే కొరవైన వూళ్లో ఆదుకొనేవాళ్లు దొరుకుతారా ?

ఎద్దుబండిని తల్లే అమ్మేసింది. అప్పులవాళ్లు గుడిసె కూడా లేకుండా చేశారు. మిగిలిన ఆస్తి— నరకాసురుడి వేషం సరంజామా ... శ్రీరామ పట్టాభిషేకం బొమ్మ. అమ్మబోయి నవ్వుల పాలయ్యాడు !

అడుక్కు తినటానికి స్వంత వూరు కన్న పొరుగూరు నయం. తిరిగే వోపికుంటే వూళ్లకేం కొదవ ? కానీ అక్కడా అచ్చిరాలేదు.

అడుక్కునేవాళ్లు వొకరిపై వొకరు పోటీపడి వేషాలేస్తారు. జాలితల్చి ధర్మం చేసే కాలమా ? జనాన్ని ఆకర్షించాలి. మాయచేయాలి. కన్ను, కాలూ వుండీ లేనట్లు మాయచేస్తారు కొందరు. కన్ను, కాలు కన్నా కడుపు నిండటం ముఖ్యమని, 'వాస్తవం ఎఫెక్ట్' కోసం కొందరు వాటిని లేకుండా చేసుకొంటారు. దేముడి పేర వేషాలేస్తారు కొందరు. పాటలు పాడ్తారు — బొమ్మలేస్తారు. ఒక కుర్రాడు చర్చిముందు, రోడ్డుమీద క్రీస్తుబొమ్మ వేస్తే కనకవర్షం రాలింది. మర్నాడు వాడే ఆంజనేయస్వామి గుడిముందు హనుమంతుడి బొమ్మ వేస్తే డబ్బులతోపాటు కొబ్బరికాయలూ పగిలేయి ! అడుక్కు తినటమూ కళే ! ఎన్ని అబద్ధాలను ఎంత ఆకర్షణగా చెప్తే అంత ఆదాయం!

రాములుకి పాటలొచ్చు. అన్నీ దేముడి పాటలే. చిరతలు కూడా వున్నాయి. కానీ దేముడంటే అసహ్యం ! ఎలా ఆ పాటలు పాడటం ?

రైలెక్కేడు. అక్కడ ముష్టెత్తడం కొందరి 'మొనాపలీ'. కొత్తగా పోటీకొచ్చిన రాముల్ని వో స్టేషనులో దింపి తన్ని అవతలికి నెట్టివెళ్లేరు.

ఆకలితో ప్రాణం కడగట్టిపోతుంటే 'అమ్మా' అని, 'ఆకలి... అన్నం' అని అన్నాడేకాని 'రామా' అని తలవలేదు రాములు. ఆ బాధలో తండ్రి — ఆయన వేసే నరకాసురిడి వేషం గుర్తుకొచ్చింది. మూట విప్పేడు.

నరకాసురుడి వేషంలో అడుక్కొంటున్న రాముల్ని చూచి కొందరు నవ్వేరు. ఎగతాళి చేశారు. మరికొందరు అసహ్యించుకొన్నారు.

'దేశంలోని బడా బడా నరకాసురులంతా శ్రీరామచంద్రుడంతటి గొప్పవాళ్లలా పోజు పెట్టి పినాదాల ముసుగుల్లో బలహీనుల్ని నిలువునా దోచేస్తున్న కాలంరా అబ్బీ యిది. అడుక్కోటానికి నరకాసురిడి వేషం కట్టిన నీ అమాయకత్వానికి జాలిపడి వో సలహా యిస్తా విను వేషం మార్చు వెంటనే. నన్నడిగితే శ్రీరామచంద్రుడి వేషమో, ఆంజనేయస్వామి వేషమో బెస్టు. ఆ రాములవారి మహత్తేమోకాని అబ్బీ... తనని తిడ్తూ పిచ్చి పుస్తకాలు వ్రాసినవాళ్లకి, వాటిని ప్రచురించిన, నిరక్షరకుక్షులకి కూడా సిరిసంపదలు యిస్తున్నాడు. పొగిడినా తిట్టినా పేచీలు పెట్టని దేముడాయన. అయినా తిట్టటానికి 'మేధావులు' కొందరు తయారయ్యారు కనుక నువ్వక్కర్లేదు. ఆంజనేయస్వామి వేషం వేసుకొని ఆయన్ని పొగుడు. ఆకలి నీ దగ్గరికొస్తే నన్నడుగు.'

సలహాతోపాటు ఆ యువకుడిచ్చిన డబ్బు, రాములు ఆకలిని చంపింది. తల్లి వారసత్వం శ్రీరామ పట్టాభిషేకం బొమ్మ చూస్తూ ఆలోచిస్తున్నాడు. 'హనుమంతుడు — ఆంజనేయస్వామి !' తను అలాగే వుంటాడనేవారుకదా అంతా. భగవంతుడు తనని యిలా బతకటానికే అలా పుట్టించేడేమో ! అయినా ఆ కోతి మొహంలో ఎంత సౌందర్యం ?

బొమ్మలో ఆంజనేయస్వామిని ఏకాగ్రతగా చూస్తూ ఆలోచిస్తుంటే ఆంజనేయస్వామి సాక్షాత్కరిచ్చినట్లయింది. వేషం వేస్తుంటే అతడిని కొత్త వుత్సాహం — శక్తి ఆవహించాయి. 'రామా... శ్రీరామా...'

* * *

వేషం కట్టిన మొదటి రోజు సంపాదన చూచుకొని గర్వించలేదు రాములు. 'అంతా ఆ రాముడి దయ' అనుకొన్నాడు మనసులో.

'నువ్వు ఆంజనేయస్వామి భక్తుడివా ?'

'వేషం వేస్తే ఆంజనేయస్వామి పూనుతాడు కదూ నిన్ను ?'

అంత బాగుందా తన వేషం ? అద్దం పెంకులో చూచుకొన్నాడు.

తలకి వెలిసిపోయిన కిరీటం — మూతికి ఎర్రరంగు... నుదుట సన్నని నామాలు... పాత బొచ్చు స్వెట్టరు... పాతగుడ్డలతో చేసిన తోక... అమ్మ ఎర్రచీరె పీలికతో కట్టుకొన్న లంగోటా... నరకాసురుడి గద... చేతిలో హరిదాసు చిరతలు... ఆ మూతి... మొహంలో రామభక్తి... అచ్చం హనుమంతుడిలాగే తను వున్నట్టు అనిపించింది ! అద్దంలో బొమ్మకు నమస్కరించి వేషం విప్పేసేడు.

జోలెనిండా బియ్యం. జేబులో చిల్లర డబ్బులు... డబ్బు దాయగలడు. కానీ బియ్యం ?

'బియ్యం వున్నాయి. ఎవరైనా కొనేవాళ్ళున్నారా అవ్వా ?'

అవ్వ మురికిపేటలో వో పాకలో వుంటుంది. పాకకు ముందే పొయ్యి పెట్టి పొద్దున యిడ్లీలు... మధ్యాహ్నం పులుసన్నం... సాయంకాలం పునుకులు అమ్ముతుంటుంది. 'ఎవరో ఎందుకు ? నేనే కొంటా బాబూ' తియ్యగా అంది అవ్వ.

మరి కొంత కాలానికి అవ్వకు 'పేయింగ్ గెస్ట్' అయ్యాడు రాములు.

ఈలోగా రాములు ఆదాయం — రోజురోజుకీ పెరుగుతూనేవుంది. అందుక్కారణం అతనికి తన వేషం పట్లగల భక్తి. వేషమంటే ... అదే కిరీటం ... అదే గద ... లంగోటీ ... ! అయితే అతని దృష్టి వాటిమీద ఎప్పుడూ వుండేది కాదు. వేషం వేసుకొన్నంత సేపూ శ్రీరామ పట్టాభిషేకం చిత్రంలో హనుమంతుడి బొమ్మే మనస్సులో మెదిలేది. వేషం పూర్తయ్యేసరికి ఆంజనేయస్వామి ఆవహించినట్లు కొత్తబలం — వుత్సాహం — శక్తి !

'రామా ... శ్రీరామా' ఆ మాటలు, పాటలు రాములు హృదయంలో నుంచి వచ్చేవి. రామభక్తి పారవశ్యంలో వేషంలో లీనమయ్యేవాడు !

హారతులిచ్చే స్త్రీలు ... పాదాభివందనాలు చేసే పురుషులు !

వేషం విప్పేసి అదంతా గుర్తుకు తెచ్చుకొంటే 'కలయా వైష్ణవ మాయయా' అన్నట్లుండేది !

'పొట్టకూటికోసం వేషం కట్టేవాడికి భక్తేమిట్రోయ్ ?' అంటూ ఆరంభించి అవ్వ అతడికి వ్యాపార ధర్మాలు నూరిపోసింది.

'అంత సంపాదిస్తున్నావు ? ఆ పిచ్చివేషమేమిట్రా అబ్బీ ! కొత్త చెమ్కీ వేషం కొనుక్కోరాదూ ? వేషం ఎంత ఆకర్షణగా వుంటే అంత వెర్రెత్తిపోతారు జనం. కనకవర్షం కురిపిస్తారు. సినిమాలు చూడటం లేదూ ?'

అవ్వదంతా హ్యాపార దృష్టి. స్వార్థం ఆమె జీవితానికి పునాది ధన సంపాదన ఆమె పూపిరి ఏ దిక్కూ మొక్కూలేని అమాయకపు రాములులో బంగారు బాతును చూచిందామె మచ్చిక చేసింది

వేషాన్ని గురించి అవ్వ అన్నాక మళ్లీ అద్దంలో తన వేషాన్ని చూచుకొన్నాడు రామ పట్టాభిషేకం బొమ్మలో ఆంజనేయస్వామితో పోల్చుకొన్నాడు. బంగారు తళుకుల్లో, బొమ్మలో ఆంజనేయస్వామి ఎంతగా మెరిసిపోతున్నాడు ? తళతళలాడే వేషం కట్టే తనూ మెరిసిపోడూ ? ధనవర్షం కురవదూ ? ఆలోచనతోపాటు అతని ధోరణి మారింది

అతడు ముష్టివాడని ముష్టివేసే వాళ్లకి తెల్సు అయినా ఆంజనేయస్వామిని అతనిలో కొందరు చూచారు భక్తుడని కొందరు, అతన్ని స్వామి పూనుతాడని కొందరు నమ్మేరు ఆ విషయం ఎవరైనా అడిగితే 'నాకవన్నీ తెలవవు బాబయ్యా అడుక్కొనేవాడిని ఆ భగవంతుడితో నన్నెందుకు పోలుస్తారు ?' అనేవాడు నిన్నటిదాకా

ఇప్పుడు ఎవరడక్కపోయినా చెప్తున్నాడు — 'నేను శ్రీరామ దూతను స్వామికి దయ కలిగి నప్పుడు నన్ను పూనుతాడు అప్పుడు నేను చెప్పేది ఆ స్వామి మాటలే ' ఆశ అబద్ధాలకి పునాది ! వ్యామోహం మోసానికి మొదటి మెట్టు ! పూనకాలు నటించేడు అవ్వ అన్నట్లు ఎంత డబ్బో !

'అంత ఆంజనేయస్వామి అంశ గలవాడైతే అడుక్కుతినే కర్మేమిటో ? వేషం మంచిగా వేసుకోటమన్నా చేతకాని వీధి బిచ్చగాడిని, దేముడని పూజించే యీ లోకం ఏం బాగుపడుతుంది ?'

ఎవరో ఆవేశంతో అన్న మాటలకి కంగారు పడ్డాడు భయం పట్టుకొంది 'నేను చెప్పలేదురా మంచి డ్రెస్సు కొను '

శరగోపరం లాంటి కిరీటం — గద తళతళ మెరిసేగిల్టు ఆభరణాలు శెకండ్ హేండ్ ఎర్ర పట్టు పంచె నేలమీద వేళ్లాడే తోక వొకటి — నిటారుగా నిలబడే తోక వొకటి — మెడలోకి స్టీలు జంధ్యం మొహానికి మేలైన ఎర్ర రంగు డబ్బా నీలంరంగు డబ్బా

'వేషం వేసుకోటంలో, వేయటంలో ఎంత థ్రిల్ వుంది '

# మనోనేత్రం

కొత్త వేషం వేసుకొంటూ తనని గురించే ఆలోచించాడు. తన వేషాన్ని చూచి తాను గర్వించాడు. ఆనందించాడు తను అందరూ అన్నంత అనాకారేం కాదు అందగాడే! ఆంజనేయస్వామి అసలు గుర్తుకు రాలేదు

అయినా అతని కొత్త వేషం మొదటిరోజు ఆదనపు లాభాన్ని గడించి పెట్టింది !

*    *    *

'మంచి పిల్లను చూచాను తొరగా పెళ్లి చేసుకోరా అబ్బిగా' రాములు అన్నం తింటుండగా మళ్లీ కదిలించింది అవ్వ

రాములు మనసుని అప్పటికే కోరిక, ఆశ, వ్యామోహాలు జయించాయి తనకేమిటి లోటు ? డబ్బు సంపాదిస్తున్నాడు ? అందరిలాగా తను పెళ్లిచేసుకొని ఎందుకు సుఖించకూడదు ? ఆకలి — కొత్త ఆకలి !

'నాకెవరు పిల్లనిస్తారవ్వా ?' తల్లి ప్రయత్నాలు గుర్తు చేసుకొంటూ మొహమాటంగా అన్నాడు

'ఎవరిదాకో ఎందుకు ? నా చెల్లెలు కూతురే వుంది ఇదిగో ఫోటో నచ్చితే రేపు పిలిపిస్తా సాయంగా చూద్దువు ఏం ? నచ్చిందా ?'

పిల్లకేం ? ఆ క్షణంలో పెళ్లి చేసుకొందామని పించేలా వుంది !

'అయితే రేపు పిలిపిస్తా వరలక్ష్మిని.'

'నువ్వు మంచివానివి అవ్వా అయితే ఓ సందేహం నేను ఆంజనేయస్వామి వేషం కడుతున్నాను కదా ? ఆంజనేయస్వామి బ్రహ్మచారి అని చెప్పిందే మా అమ్మ ?'

'బాగుందిరోయ్ మీ నాన్న నరకాసురుడు వేషం వేసేడన్నావుగా ? ఎంతమందిని చంపేడు ? ఎంత రాజ్యాన్ని సంపాదించాడు ? మీ నాన్నరాక్షసుడా ?'

ఆ రాత్రంతా రాములు, వరలక్ష్మిని దానితో కాపురాన్ని పిల్లల్ని పెద్ద పెద్ద యిళ్లని రూపాయి నోట్లని భోగాలని చూస్తూ పడుకొన్నాడు !

*    *    *

'జయ జయ శ్రీరామా రఘువరా శుభకర శ్రీరామా '

'కోతి కోతి ఆంజనేయస్వామి వచ్చాడోయ్' పిల్లలు మూగేరు కాని రాములికి ఆంజనేయస్వామి కన్పించటంలేదు కళ్లముందు వరలక్ష్మి కన్పిస్తోంది యాంత్రికంగా పాటలు పాడుతున్నాడు

ఆ రోజు ఎవరూ రాములికి దణ్ణం పెట్టలేదు హారతులివ్వలేదు.

'సంపాదనలో పడ్తే యింతే భక్తి పోతుంది కొత్తల్లో ఆంజనేయస్వామిని చూస్తున్నట్లే వుండేది నాటకాల్లో సినిమాల్లో వేషంలా ఆ వేష మేమిటి ? రైల్లో బిచ్చగాడిలా ఆ పాటేమిటి ?' చాలామంది అనుకొన్నారు కొందరు పైకే అన్నారు కాని విన్పించుకోటానికి రాములు మనసు వరలక్ష్మిపై వుందాయె !

బియ్యం బదులు ఎవరో రెండు అరటి పండ్లిచ్చారు .

'కోతి కోతి' పిల్లలు యిళ్లల్లోకి పరుగెత్తుతూ అరుస్తున్నారు ఎప్పుడూ అలా అరుస్తూ దగ్గరికొచ్చే పిల్లలు యిప్పుడు దూరంగా వెళ్తున్నారే ? ఆలోచించేదానికి బుర్ర అక్కడుంటేనా ? వరలక్ష్మి చుట్టూ ఆలోచనలు !

అకస్మాత్తుగా చేతిలో పండ్లను ఎవరో లాగినట్లయింది. చూస్తే ఎర్రకోతుల గుంపువచ్చి వున్నట్లు అర్థమయింది

భయంతో కేకవేసేడు రాములు బియ్యం సంచీ క్రిందపడింది కోతులు బియ్యంమీదికి ఎగబడ్డాయి కోతులు తనని చంపటానికే వస్తున్నట్లు భయపడి పోయాడు ! రైలు స్టేషనులో చిన్ననాటి సంఘటన గుర్తుకొచ్చింది పట్టుపంచె తడిసింది రాములికి !

రాములు వదల్లేకపోతున్నాడు కోతులు అతడి వైపు కోపంగా చూస్తున్నాయి 'గుర్రు గుర్రు' మంటూ అరుస్తున్నాయి ఆ అరుపు రాములు గుండెల్ని అదరగొట్టింది అసంకల్పితంగా పరుగెత్త బోయాడు గోచీ వూడింది పంచె కాళ్లకు అడ్డంపడి కిందపడ్డాడు. వేషం వూడింది ఓ కోతిపిల్ల ఎర్రటి పట్టుపంచెను నోట కర్చుకొంది మరో పండుకోతి కిరీటాన్ని తీసుకొంది రెండు కోతులు మెళ్లో ఆభరణాల కోసం ఎగబడుతున్నాయి గదను కింద తోస్తూ ఆడుకొంటొంది వో కోతి !

వానరాగ్రేసురుడైన ఆంజనేయస్వామి సాధారణ కోతులకు భయపడ్తాడేం ? మొన్నటి ఆంజనేయ స్వామిలో ఆవేశం, శక్తి యీ ఆంజనేయస్వామిలో లేవేం ? ఒకే మనిషి — వొకే వేషం — కాని యీ మార్పేమిటి ? మొన్నటి వేషధారిని పూజించారు యీవేళ వేషధారి అవస్థను చూచి నవ్వుతున్నారు జనం !

క్రిందపడ్డ రాములు లేచాడు పరుగెత్త బోయాడు యీతడవ తోక కాళ్లకడ్డం పడింది క్రిందపడ్డాడు తల నుంచి రక్తం కారింది

'రామా' అనలేదు. 'అమ్మా' అనైనా అనలేదు 'వరాలూ' అన్నాడు

అతని వేషం పూర్తిగా వూడిపోయింది

జీవిత వేషం పూర్తయిందో లేదో . ?

తెల్సుకొని ప్రయోజనం ఏమిటి ?

మనోనేత్రం మూసుకుపోయిన అనేకమంది మనుష్యుల్లో అతనొకడు పాపం !



## కోరికల కొలుములు

ఎన్నో వస్త్రాల చాటున శరీరాన్ని దాచుకున్నా
నాలో కోరికలు నగ్నంగానే వున్నాయి

తోటలోని గులాబీల గుబాళింపు కోసం
నా రక్తాన్నే ఎరువుగా వాడాలనేదే నా భావన

స్నేహితుల్ని పరీక్షిస్తూ పోతూ, శత్రువుల్ని ప్రేమించటం నా ఆలాపన

ఉరుముల ఘోషకు ఉవిదకౌగిలి ఉక్కిరి బిక్కిరి చేస్తే
దేవుడా వాన పాగనీయి అనేది కూడా నా ఆలోచనే

చెక్కక ముందు రాయి అయి చెక్కాక దేవుడైన వాడికి భయపడను
చుట్టూ తిరిగే జీవుడంటే మాత్రం ఏణికి చస్తాను.

పై కోరికలుండ బట్టే దేవుణ్ణి కాలేక కింకరుణ్ణయి
అడ్డమైన వాళ్ళచేత అష్టకష్టాలకు గురియైనాను

— "సుచంద్ర"

'ప్రేమాభిషేకం'లో ఒక సన్నివేశం

## 1980

"కులాభిమానం, కులతత్వాలను సవాలు చేసే ఇతివృత్తం," అన్నారు యు. విశ్వేశ్వరరావు. ఈయన కథ, దర్శకత్వంలో కల్యాణ్ సంజయ్ ఇంటర్నేషనల్ వారి "1980" చిత్రం 16 ఎం. ఎం. లో షూట్ చేయబడి, ఆ తర్వాత 35 ఎం. ఎం. కు బ్లో అప్ చేయబడుతుంది. ఇందువల్ల దాదాపు లక్షన్నర రూపాయలవరకు వ్యయం తగ్గుతుంది. శ్రీశ్రీ, కొండవీటి వెంకటకవి, కొనరాజు, విశ్వేశ్వరరావు మాటలు, పాటలు రాస్తున్నారు. తాతినేని చలపతిరావు సంగీతం, మోహనకృష్ణ ఛాయ ఇతర ఆకర్షణలు. ప్రభ, సంగీత నాటక అకాడమీ సంయుక్త కార్యదర్శి బి. కృష్ణంరాజు. ఎస్. వి. ఎస్. ప్రసాదరావు, బవేజా, కొత్త నటుడు ఎ. నాగేశ్వరరావు ప్రభృతులు పాల్గొంటారు. "గూడవల్లి రామబ్రహ్మంగారికి అంకితమిస్తున్నాం," అన్నారు ఈ చిత్రాన్ని సమర్పించే వేమన సత్యం. అజయ్, వంశీ నిర్మాతలు.

## పి. వి. రెడ్డి దర్శకత్వంలో భోగ భాగ్యాలు

జనవరి 21న సెట్స్‌కు వెళ్లిన మరో చిత్రం ఎస్. ఎల్. మూవీస్ "భోగ భాగ్యాలు". "ఈ [redacted] 'సంసారం సంతానం'లో ప్రభాకరరెడ్డి, కె. వి. చలం



షెడ్యూల్ 31 వరకు ఉంటుంది," అన్నారు స్క్రీన్‌ప్లే, దర్శకత్వం వహించే పి. చంద్రశేఖరరెడ్డి. కృష్ణ, శ్రీదేవి, గిరిబాబు, గుమ్మడి, నూతన్‌ప్రసాద్, రావి కొండలరావు, శుభ, పొలం వగైరా తారాగణం. ఉషశ్రీ కథకు మోదుకూరి జాన్సన్ మాటలు రాశారు. చక్రవర్తి, పుష్పాల గోపీకృష్ణ, పేకేటి రంగా, వి. అంకిరెడ్డి, మోహన్‌జీ జగన్, ధ్రువకుమార్, టి. శ్రీరామరెడ్డి ప్రభృత సాంకేతికవర్గం. "ఫిబ్రవరి 19 నుంచి 28, మార్చి 21 నుంచి 31 వరకు జరిగే షెడ్యూల్స్‌తో దాదాపు పూర్తవుతుంది," అన్నారు నిర్మాత ఎస్. పరంధామరెడ్డి.

జి. వి. జి.

## సుమతి

"ఒకసారి నేను ప్రయాణం చేసే ట్రెయిన్‌కు ప్రమాదం జరిగింది," అంది సుమతి. "ఒక తమిళ చిత్రం ఔట్‌డోర్ షూటింగ్‌కు బయలుదేరాను. మద్రాసుకు సమీపంగానే ప్రమాదం సంభవించింది. పై బర్త్‌లో పడుకోనున్న ఓ లావుపాటి ఆమె వొచ్చి, కింది బర్త్‌లో పడుకోనున్న నామీద దబీమని పడింది. దైవవశాత్తూ నాకు ఒట్టే గాయాలు తగల్లేదు," అంది. ఈమె తన అన్న ప్రభాకర్‌తో కలిసి లోగడ "బాలరాజు కథ"లో నటించింది. శోభన్‌బాబు చెల్లెలుగా "పండంటి జీవితం"లో నటించింది. ఇందులో ఈమె మరణించే సీన్‌లో ఈమెను పాడెమీద కట్టి అసలు స్మశానానికే తీసుకెళ్ళారు. కట్టెలు పేర్చి, పడుకోబెట్టారు కూడా. అప్పుడక్కడున్న కాటికాపరి "పాపం, చిన్నపిల్ల. ఈమెనే పడుకోబెడ్తున్నారే!" అన్నాడు. అతని భార్య "ఇక్కడే నటి శోభకు కూడా ఇదివరకు అంత్యక్రియలు జరిగాయి," అనేసరికి సుమతికి దాదాపు గుండె ఆగినంత పనైందట. "ఆ మహానటి ఆత్మకు శాంతి చేకూరాలని అక్కడే భగవంతుని ప్రార్థిస్తూ షూటింగ్ ముగిసేవరకు అలాగే కళ్ళు మూసుకొని ఉండిపోయాను. ఆ తర్వాత ఇంటికి వచ్చాక అమ్మకు ఆ సీను గురించి చెప్పాను. అమ్మ ముఖం అదోలా అయిపోయింది. వెంటనే నాకు స్నానం చేయించి, కర్పూర హారతితో దిష్టి తీసి, కొబ్బరికాయ కూడా కొట్టింది. అయినా, ఎందుకో ఆ రోజంతా కూడా నేను డల్‌గా ఉండిపోయాను. నేను స్మశానంలో అంత ధైర్యంగా నటించినందుకు (కళ్ళు మూసుకునే) ఆ చిత్ర నిర్మాత మిద్దె రామారావుగారు నాకు చాలా ఖరీదైన పట్టుచీరను ప్రెసెంట్ చేశారు," అంది సుమతి. ఈ అమ్మాయిని



'ప్రేమనాటకం'లో ఒక సన్నివేశం

నటుడు సుధాకర్ "బేబీ! పొండబ్బా కావాలా?" అని తరచు వేళాకోళం చేస్తుంటాడు. వీరిద్దరూ కలిసి నటించిన "పేదల బ్రతుకులు" చిత్రం త్వరలో విడుదలవబోతోంది.

## జయసుధ

"జనవరి 29 వరకు తొలి షెడ్యూల్ ఉంటుంది. రెండవ షెడ్యూల్ ఫిబ్రవరి 15 నుంచి 28 వరకు," అన్నారు దాసరి నారాయణరావు. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు రాసి విశిష్టమైన పాత్ర నిర్వహించే తారకప్రభు ఇంటర్నేషనల్ వారి పై చిత్రానికి జనవరి 15న ప్రారంభోత్సవం జరిగింది. జయసుధ, మురళీమోహన్, మోహన్‌బాబు, సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, నరసింహరాజు, పుష్పలత, సుకుమారి ఉన్నారు. రమేష్ నాయుడు, కె. ఎస్. హరి, భాస్కరరాజా, కృష్ణ, సి. వి. రమణబాబు, ప్రభాకర్, సతీష్, మధు, ప్రకాష్, స్వామి ప్రభృతి సాంకేతిక బృందంతో కె. బసవయ్య నిర్వహణలో చి॥ తారక హరిహరప్రభు నిర్మాత. "ఏప్రిల్‌కు పూర్తవుతుంది," అన్నారు డైరెక్టర్ కె. వి. నందనరావు.

'రహస్య గూఢచారి'లో ఒక సన్నివేశం





'భోగిమంటలు'లో ఒక హాస్య సన్నివేశం

## సినిమా

### ప్రియలో –

గెస్ట్‌హౌస్‌లో ఏకాంతంగా పడుకొని ఉన్న రాధిక (రాధిక) గదిలోకి విజయ్ (చిరంజీవి) ఈలలు వేస్తూ ప్రవేశించాడు. రాధిక ఉలిక్కిపడి లేచి, లైటు వేసింది. విజయ్ నవ్వుతూ, "హల్లో, మ్యారేజ్ గర్ల్! ఇంకా నిద్రరాలేదా? నిద్ర రాకపోవడానికి రెండే కారణాలు ... ఒకటి – ప్రేమించనైనా ఉండాలి. రెండు–ప్రేమ విఫలమై అయినా ఉండాలి ... మరి, నీదే కేసు ?" అన్నాడు.

రాధిక అయోమయంగా చూస్తూ, "సారీ ... మీరు – ?" అంది.

"నా పేరు విజయ్. ఈ ఇంటికి వారసుడ్ని; నీకు కాబోయే భర్తరత్నాన్ని."

"ఏమిటి ! ఏమిటి మీరనేది ?"

"ఈ ఇంట్లో ఇద్దరు ముసలాళ్ళున్నారు. ఐ ఆర్ ... యువర్ ఫాదర్ అండ్ మై ఫాదర్ ... వాళ్ళిద్దరూ కలిసి రెండు మర్డర్లు చేయాలని ప్లాన్ చేస్తున్నారు."

"మర్డర్లా !"

"ఆఁ! ఇష్టంలేని పెళ్ళిని ఇంకేమంటాం ?"

"పెళ్ళా ! ఎవరికి ?"

"నీకూ నాకూ. నీ సంగతేమో నాకు తెలియదుగాని, నాకెప్పుడో పెళ్ళయిపోయింది," అంటూ ఒక అమ్మాయి ఫోటోను జేబులోంచి తీసి చూపిస్తూ, "మై స్వీట్ డార్లింగ్ ... చచ్చేదాకా వదలిపెట్టనని ఈవిడకు ప్రమాణం చేశాను అగ్నిసాక్షిగా. ఆ ప్రమాణం తప్పడం న్యాయమా ? నిన్ను పెళ్ళి చేసుకోవడం ధర్మమా ? ఆఁ. చెప్పు!" అన్నాడు విజయ్.

"కాదు; ధర్మం కాదు."

"అందుకని వాళ్ళొచ్చి నిన్నడిగితే, నా కిష్టం లేదని చెప్పెయ్ ! మరేం ఫర్వాలేదు, మ్యారేజ్ గర్ల్! నీ వెనక దగా ... ముందు దగా ... నీ చుట్టూ దగా ... జాగ్రత్త ! గుడ్‌నైట్ !" అంటూ వెళ్ళిపోయాడు విజయ్.

రాధికకు ఏం పాలుపోక తెల్లబోయి చూస్తూండిపోయింది.

ఎస్. పి. చిట్టిబాబు దర్శకత్వంలో రాయపరాజు నిర్మించిన ప్రభుచిత్ర వారి "ప్రియ" చిత్రంలో చంద్రమోహన్, స్వప్న ఇతర ప్రధాన పాత్రధారులు. ఆత్రేయ రచయిత, చక్రవర్తి సంగీత దర్శకుడు. వి.లియప్ప ఛాయాగ్రాహకుడు. డి. రాజగోపాల్ సంకలనకర్త.

### అర్ధాలు వేరు

"అక్కా చెల్లెళ్ళ ఇతివృత్తం. రెండు కుటుంబాలకు సంబంధించిన కథ," అన్నారు ఎస్. ఎ. రాజకన్ను. ఈ తమిళ దర్శక నిర్మాత తెలుగులో తొలిసారిగా తయారుచేస్తున్న శ్రీ అమ్మన్ ఆర్ట్స్ క్రియేషన్స్ వారి పై చిత్రంలో శాంతి-దేవేంద్ర, భువనేశ్వరి– పార్థివన్ అనే రెండు కొత్త జంటలతోపాటు రమణమూర్తి, మల్లాది, సాక్షి రంగారావు, పొట్టిప్రసాద్, కృష్ణమూర్తి, జయవిజయ పాల్గొంటున్నారు. నేతాజీ కథకు జంధ్యాల మాటలు రాశారు. ఆరుద్ర, జాలాది గీతాలకు శంకర్ గణేశ్ బాణీలు కూర్చారు. "కోయంబత్తూర్, పొల్లాచి పరిసర గ్రామాలలో నలభై అయిదు రోజులపాటు నిర్విరామంగా షూటింగ్ జరుగుతుంది," అన్నారు రాజకన్ను.

### హిందీ చిత్ర

★ ఇదివరకు "లల్‌కార్, జల్తి బదన్, హాత్రమాహి, రాన్ భరోస్, హమ్ తేరే ఆషిక్ హైన్" చిత్రాల పాటల పుస్తకాలు పెద్ద సైజువి. వాటిని మించిపోయింది "ప్యారా దుష్మన్" పాటల పుస్తకం. దీని సైజు 20"×3".

★ త్వరలో ఒక చిత్రానికి దర్శకత్వం వహిస్తూ నిర్మాతగా మారే నటి సిమి నాయికగా రాజ్‌కపూర్ తమ్ముడు షమ్మికపూర్‌తో "అందాజ్"లో, మరో తమ్ముడు శశికపూర్‌తో "సిద్ధార్థ"లో, కొడుకు రణధీర్‌కపూర్‌తో "హాత్‌కి సఫాయి"లో, మరో కొడుకు ఋషికపూర్‌తో "కర్జ్"లో నటించింది. ఇప్పుడు ఇంకో కొడుకు రాజీవ్‌కపూర్‌తో "బిబి ఓ బీబీ" చిత్రంలో నటిస్తోంది.

★ యునైటెడ్ కింగ్‌డమ్ టి. వి. లో ప్రదర్శింపబడిన తొలి భారతీయ చిత్రం "అమర్ అక్బర్ ఆంథోని".

★ ఫిల్మిస్తాన్ స్టూడియోలోని పెద్ద ఫ్లోర్

# విచిత్రాలు

(నెంబర్–3) త్వరలో ఏర్‌కండిషన్డ్ చేయబడుతుందట.

★ నీతుసింగ్ – ఋషికపూర్‌కు వీరికి జనవరి 20న వివాహమైంది. సెప్టెంబర్ 14న – అంటే, తొమ్మిది నెలలకు ముందే నీతు ఆడశిశువును ప్రసవించింది! హిందీ తారలు చాలామందికి తొలి సంతానం ఆడశిశువే – అమితాబ్‌బచ్చన్, ఫిరోజ్, సంజయ్, రాజేష్‌ఖన్నా, జితేంద్ర, రణధీర్‌కపూర్, ప్రేమ్‌చోప్రా... "ఈ విషయంలోనూ నా దారి వేరు. మా ఆవిడ తొలి కాన్పు మగబిడ్డ," అని విజయ్ ఆనంద్ జబ్బలు చరుచుకుంటూ ఉంటాడట.

★ హిందూ ముస్లిమ్ సమైక్యతమీద జి. పి. సిప్పీ నిర్మించే ఒక రీలు డాకుమెంటరీలో అమితాబ్‌బచ్చన్ నటించబోతున్నాడు.

★ వినోద్‌మెహ్రా నటించే చిత్రాల్లో ప్రాణ్ ఇటుపై నటించడట. తాను కూతురుతో సమానంగా భావించే మీనాతో వినోద్‌కు అక్రమ సంబంధం ఉండడమే అందుకు కారణమట.

## కొత్త నీరు కథా కమామిషు

"మీ చిత్రానికి 'కొత్తనీరు' అని పేరెందుకు పెట్టినట్లు?" అన్నాను.

డైరెక్టర్ కె. ఎస్. ప్రకాశరావు సిగరెట్ వెలిగించి, ఇలా చెప్పసాగారు: "నిన్నటికి – రేపటికి మధ్య నేడు ఉన్నట్లే – కొత్తకూ పాతకూ మధ్య మార్పుంది. ప్రతి మార్పూ, ప్రతి సంస్కరణా కొంత మారణహోమం లేనిదే సునాయాసంగా సిద్ధించవు. ఎంతో త్యాగం, శ్రమ, కృషి ఫలితంగానే మార్పు జనిస్తుంది. మంచీ చెడుల మధ్య ఉద్భవించే ఆ మార్పుకూ, ఆ ఉధృతంలోని వేగానికీ కొంత బలిదానం తప్పనిసరి. అది వర్ణిత చరణంగా చరిత్ర తీర్చిన ఒరవడి... అది నాగరికతకు నాలుగు రోడ్లవతలగా నిశ్శబ్దంగా ఉన్న ఒక పల్లె. మూఢ నమ్మకాలు, వర్ణ విభేదాలు, అంతస్తుల ఆకర్షణలు నిరివిగా ఉన్న విచిత్ర సౌధం ఆ ఊరు. ఆ ఊరికి – పక్కనున్న బస్తీకి ప్రయాణ సౌకర్యాలు లేవు. అయితే, రెంటికీ లంకె కనకయ్య. అతను ఆ ఊరికే కాక పక్కనున్న రెండు మూడు పల్లెలకూ ప్రాణ వాయువు లాంటివాడు. నిజానికి అతనొక చిన్న సైజు పార్శిల్ వేగన్! ఎవరెవరి అవసరాలేమిటో, ఎవరికి ఏం కావాలో అతనికి కొట్టిన పిండి. అంతెందుకూ? రంగమ్మకు మట్టెలు, ఆమె కోడలికి స్నో పౌడర్లు, రామయ్యకు ముక్కుపొడి, రామశాస్త్రిగారికి ఇంగువ – ఇలాంటివి అడిగించుకోకుండా సప్లయ్ చేస్తాడతను. అందరికీ తలలో నాలుకలా మసల్తూ ఉంటాడు... ఇలా నింపాదిగా నిర్మలంగా నిశ్చలమైన తటాకంలాంటి ఆ ఊళ్ళో హఠాత్తుగా కదలిక ప్రారంభమైంది! దాని పేరే నాగరికత – అది కామాక్షి రూపంలో వచ్చింది. ఆమెది బస్తీ పక్క ఊరు. బస్తీ ఫాషన్లు, షోకులు ఆమెతోపాటు ఆ ఊళ్ళో అడుగుపెట్టాయి. కనకయ్యకు భార్యగా, ఆ ఇంటి కోడలుగా ప్రవేశించిన కామాక్షి ఆ ఊళ్ళో పడుచు గుండెల్లో పులకరింతగా, పెద్దలకు కంటగింపుగా మారింది. ఇలా కామాక్షి రాకడ ఆ ఊళ్ళో అలజడి రేపింది. ఇదొక నిశ్శబ్దమైన సంఘర్షణ... ఈ కొత్త పాతల మధ్య సంఘర్షణ ప్రభావం మాత్రం నిశ్శబ్దంగా లేదు;



'టాక్సీ డ్రయివర్'లో ఒక సన్నివేశం



అంతరాంతరాల్లో చిన్నసైజు అణుబాంబులు పేలినంత భయంకరమైన ప్రశాంతత. ఇది నిన్న మొన్నటిది కాదు; నింగి, నేల, నీరు, నిప్పు పుట్టిన మర్నాటినుండి ప్రారంభమైనంత ప్రాచీనమైనది. దీనికి బలి అయ్యేది బక్క ప్రాణాలూ, బడుగు జీవాలూ – కనకయ్య, కామాక్షిలాంటి ఇన్నేం పున్నేం ఎరుగని అమాయకులు. కాపురం అంటే కమ్మని కల అనుకున్న కామాక్షి బ్రతుకు కలతలకే నిలయమైంది. వెన్నెలంటే తెలుసనే తప్ప చీకటంటే నలుపని తెలియని కనకయ్య బ్రతుకు కన్నీటికే చైత్రాలయింది... ఇదే మా చిత్రంలో అంతర్లీనమైన కథ."

చిత్ర సాహితీ వారి "కొత్తనీరు"లో చంద్రమోహన్, మోహన్ బాబు, కాకరాల, ముక్కామల, తిరుపతి, మాధవయ్య, దీప ప్రముఖ భూమికలు నిర్వహించారు. ఆరుద్ర రచయిత, రమేష్‌నాయుడు సంగీత దర్శకుడు, నవకాంత్ ఛాయాగ్రాహకుడు, కోటగిరి గోపాలరావు సంకలనకర్త.

శ్రీమతి అక్కినేని అన్నపూర్ణ సమర్పించు

దాసరి నారాయణరావు

అన్నపూర్ణ స్టూడియోస్



# ప్రేమాభిషేకం

నిర్మాతలు: వెంకట్ అక్కినేని, నాగార్జున అక్కినేని

అన్నపూర్ణ ఫిలింస్

# అవార్డు చిత్రాల ఇతివృత్తాలు

జనవరిలో న్యూఢిల్లీలో జరిగిన 8వ అంతర్జాతీయ చలన చిత్రోత్సవాల్లో మన దేశం ప్రకటించిన స్వర్ణ, రజత మయూర పతకాలను 8 విదేశీ చిత్రాలు, 2 భారతీయ చిత్రాలు గెలుపొందాయి. ఈ చిత్రాల ఇతివృత్తాన్ని క్లుప్తంగా పరిశీలించడం ఇక్కడ జరిగింది.

### ది అన్‌నోన్ సోల్జర్స్ పేటెంట్ లెదర్ షూస్

దర్శకుడు రాంఫెల్ వల్చనోవ్ దర్శకత్వం వహించిన ఈ బల్గేరియా చిత్రంలో 1930 ప్రాంతంలో, రెండు ప్రపంచ యుద్ధాల మధ్య గడిచిన తన బాల్యంలో మనోఫలకంమీద చెరగని ముద్ర వేసుకున్న అనేక విషయాలను, విచిత్ర సంఘటనలను తను గన్న ఓ రంగుల కలగా, తన ప్రత్యేక పద్ధతిలో దర్శకుడు తెరకెక్కించాడు. నాటి బల్గేరియా దేశపు జీవన స్వరూపానికి కళాత్మకంగా అద్దంపట్టి మన మనస్సుకి హత్తుకుపోయేలా చిత్రీకరించడంతో ఉత్తమ చిత్రంగా ఎన్నిక కాబడి స్వర్ణ మయూర పతకాన్ని పొందడం అందరి హర్షాన్ని పొందింది !

### ఆక్రోశ్

హిందీలో నిర్మింపబడి, స్వర్ణమయూరాన్ని పంచుకున్న ఈ భారతీయ చిత్రంలోని కథాంశం

[42వ పేజీ చూడండి]

# వెతుక్కోవాలి




శాంతి

"ఆగు — "

కాగితం చుట్టిన బరువైన పొట్లాన్ని చేతిలో గట్టిగా పట్టుకుని, భుజానికి వ్రేలాడుతున్న హేండ్ బేగ్‌ని వూపుకుంటూ చకచకా నడుస్తున్న సునంద వెనకట్నుంచీ యెవరో క్రూరంగా పిలవడంతో భయపడుతూ ఆగింది

టైమ్ సుమారు రాత్రి యెనిమిదిన్నర ఐయుంటుంది.

మెయిన్‌రోడ్లలో జనాలు ఇంకా తిరుగుతున్నారు —

ఊరికి చివరగా సునంద నడుస్తున్న సన్నజాజి సందు మాత్రం నిర్మానుష్యంగా భక్తులు రాని పాడుబడ్డ దేవాలయంలా వుంది కొన్నిసార్లు — కొన్ని వూర్లపేర్లు, ఆ వూర్లలోని వీధులపేర్లు వింతగా, ఆ పేర్లకు విరుద్ధంగా వుంటాయ్

సన్నజాజి సందులో సన్నజాజులు లేవు గాని బొమ్మజెముడు, నాగజెముడూ లాటి ముళ్ళచెట్లు ఏపుగా పెరిగి నిలిచివున్నాయ్

ఆ సందులో ఇళ్ళేకావు—గుడిసెలు కూడా లేవు

అర్ధరాత్రే కాక పట్టపగలు కూడా అక్కడ తేళ్ళు జెర్రులూ విందులు, వినోదాలు చేసుకుంటుంటాయని వూళ్ళో వారెవరూ ఆ సందుకేసి యెక్కువగా రారు.

రోడ్డు ఎప్పుడో బీసీనాడు వేసి ఇప్పుడు శిధిలమైనట్టు పూర్తి గతుకులతో వుండి — ఎక్కడో వో చోట మాత్రం చదునుగా వుంది. పైవన్నీ అలా వున్నప్పుడు లైట్లుమాత్రం అక్కడెలా వుంటాయ్ ? సన్నగా పొడువుగా వున్న సందులో -- వున్న మొత్తం మూడు బార్‌లైట్లలో రెండు పనిచెయ్యవు. మధ్యనున్న వొక్కటి మాత్రం కొనవూపిరితో వుండే రోగిలా ఆరి ఆరి వెలుగుతోంది ఇన్ని దుర్గుణాలున్నా సునందకి ఆ సందంటే చచ్చేంత ఇష్టం కారణం — ఆ సందు అందాలు ఆమెని ఆకర్షించికాదు -- ఆ సందు ఆమెను తొందరగా ఇంటికి చేరుస్తుంది కాబట్టి.

రోజూ ఆఫీస్ నుండీ సాయంత్రం ఐదున్నరకు విడుదలై, అట్నుంచీ రాత్రి యెనిమిదిన్నర వరకూ ఏ కాఫీ, టిఫెనూ లేకుండా ట్యూషన్స్ చెప్పేందుకు టౌన్లోనే వుంటుంది సునంద ఇంటి ఖర్చులు చాలక ఆమె బస్సులెక్కదు నడిచి వూరవతలున్న యెన్జీవోల క్వార్టర్స్ పక్కగా వున్న ఇంటికి చేరాలంటే మెయిన్ రోడ్డు గుండా వొకటిన్నర గంటౌతుంది ఐతే అదే దూరాన్ని అడ్డంగా తిరిగి సన్నజాజి సందునుంచీ వెళ్తే ముక్కాలు గంటలో అధిగమించవచ్చు అందుకే ఇంట్లోవాళ్ళు వొద్దన్నా, లోపల తనకూ భయంగా వున్నా ఆకలి బాధను తట్టుకోలేక రోజూ అదే సందును ఆశ్రయిస్తుంది సునంద.

ఆ రాత్రి హఠాత్తుగా ఎవరో వెనకట్నుంచీ క్రూరమైన గొంతుతో ఆగమంటుంటే అలాగే నిలబడిపోయిన ఆమె కళ్లముందు — వొక్కక్షణం రోజూ పేపర్‌లో చదివి, ఆఫీస్‌లో చెప్పుకునే రేప్‌సీన్లు కదలాడేయి కాని సునందకు స్వభావసిద్ధంగా వున్న ధైర్యం ఆమెని భయపడనీయలేదు. రోజూ ఏదో జరుగుతుందని యెక్స్‌పెక్ట్ చేస్తూ ఆ సందులో భయంతో నడచినడచి అలవాటైపోయిన ఆమెకి తీరా అది జరుగుతుందన్పించేసరికి ఏమీ అన్పించలేదు

సరిగ్గా రోడ్డు మధ్యలో — గుడ్డిలైటు కిందుంది. పరిగెత్తాలన్నా సగం సందు మిగిలుంది కాబట్టి — నిలబడి పోరాడ్డమే గతి ఏ భావం కన్పించనీయకుండా మెల్లిగా వెనక్కితిరిగి చూసింది సునంద. వెనకాల పొదల్ల దగ్గర ఇద్దరు వ్యక్తులు — చెరో కత్తి దూసి నిలబడున్నారు వాళ్ళకు సినిమాల్లోని రౌడీల్లా పెద్దపెద్ద మీసాలు గానీ, చారల చొక్కాలు, కలర్ బనీన్లూ, గిరజాల జుట్టూ, భీకరమైన చూపులు — వగైరాలు గానీ అసలే లేవు.

ఇద్దరికీ దాదాపు పాతికేళ్ళ వయసుండొచ్చు మామూలు పేంటూ, చొక్కాలతో అమాయకంగా వున్నారు. సునందకు వాళ్ళ వయసువాడే ఐ జ్వరంతో ఇంట్లో పడుకుని తనకోసం యెదురు చూసే తమ్ముడు విశ్వం గుర్తుకొచ్చేడోక్షణం. అతని కోసం కొన్న చేతిలోవున్న రొట్టె పొట్లాన్ని భయంగా గుండెల కదుముకుంది

"ఆగు ! అక్కడే ఆగు ! అరవకు !"

ఇద్దర్లో కొద్దిగా పొడవుగావున్న మాసిన తెల్లచొక్కా కుర్రాడు సునందని కమేండ్ చేసేడు కత్తి చూపించి.

కత్తి చూస్తే స్పృహ తప్పేలావుంది కాని అమాయకంగా కన్పిస్తున్న తెల్లచొక్కా అబ్బాయిని చూసి నిలదొక్కుకుంది సునంద.

"ఎవరు మీరు ?" సూటిగా చూస్తూ ప్రశ్నించింది

తల్లీబిడ్డల మమతానుబంధం
భార్యాభర్తల అనుబంధం
ఇతివృత్తంగా మహిళాలోకాన్ని ఆకర్షిస్తోన్న...




నిర్మాత: కె.విద్యాసాగర్ M.Com., కథ-స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: బీరం మస్తాన్‌రావు

da DIMPLE DESIGNERS

# డాక్టర్ సలహాలు

పి వి ఆర్ — వీరంకిలాకు

నేను కాలకృత్యములు తీర్చుకొనునప్పుడు, చదువుతున్నప్పుడు, వ్రాయుచున్నప్పుడు 15 నిముషముల తర్వాత కంటిలో నీరు క్రమ్ముచున్నది అక్షరములు మసకగా కనబడుచున్నవి

★ "డాక్రోసిస్టైటిస్" అనే రోగంవల్ల ఇలా ఏర్పడే అవకాశం ఉంటుంది కొందరికి నరాల ప్రేరేపణవల్ల కంటినీరు ఉత్పత్తి ఎక్కువ అయి ఇలా రావటం జరుగుతుంది కంటినీటిని కనుపాపల నుంచి సంగ్రహించి ముక్కుకి జేరవేసే నాళం మొగటి భాగం వాచి రోగగ్రస్తమవటాన్ని డాక్రోసిస్టైటిస్ అని అంటారు దీనికి శస్త్ర చికిత్స అవసరం అవుతుంది

ఈ రోగం ఉన్నవారికి కనుపాపల నుంచి "కన్నీరు" బుగ్గలమీదగా జారిపోతూ ఉంటుంది ఇలా నీరు క్రమ్మటంవల్ల అక్షరాలు మసకగా కనిపిస్తాయి

ని పి — కొవ్వూరు

మా బాబుకి పుట్టిన 30 రోజులలో మెదడు జబ్బు వచ్చినది అప్పటినుండి కాళ్ళు రెండు నిదానముగా వాసి పుంటుతాడు మోకాళ్ళ దగ్గర మడత పడటములేదు ఇప్పుడు మా బాబు వయస్సు 3 సం॥లు ఏమైనా పట్టుకొని నడవగలుగుతాడు కాని తనకు తాను సొంతముగా నడవలేకపోతున్నాడు మా బాబుకి మోకాళ్ళు ఎందుకు అలా మడత పడట్లేదు ? పుట్టుకతో అలా వున్నాయా ? లేక మెదడు జబ్బులో అలా వచ్చినదో తెలియట్లేదు దీనికి ఏమి చెయ్యాలి ?

★ పిల్లలు పుట్టే సమయంలో ఆలస్యం జరుగటం వల్ల, మరికొన్ని కారణాలవల్ల, వారి మెదడు ఆక్సిజన్ లేకపోవటం వల్ల దెబ్బ తింటుంది దీనిని "సెరిబ్రల్ పాల్సీ" అని అంటారు

ఈ రోగం వచ్చిన వారికి కూర్చోవటం, నడవటం, మామూలు వారికన్నా ఆలస్యం అవుతుంది. కాలక్రమేణా పరిస్థితి మెరుగవుతుంది.

బి ఆర్. — భిలాయి

'మయోకార్డియల్ ఇన్‌ఫ్రాక్షన్'కి 'మయోకార్డియల్ ఇస్కేమియా'కి తేడా ఏమిటి ?

రెండుసార్లు గుండెపోటు వచ్చిన తరువాత మూడోసారి వచ్చే గుండెనెప్పి చాలా తీవ్రంగా వుంటుందంటున్నారు. ఇది నిజమేనా ?

★ "మయోకార్డియల్ ఇస్కేమియా" అంటే హృదయ కండరాలకి రక్త సరఫరా తగ్గింది అని అర్థం "మయోకార్డియల్ ఇన్‌ఫార్‌క్షన్" అంటే హృదయంలోని కండరాలు నెత్తురు సరఫరా పూర్తిగా లేకపోవటంవల్ల "చచ్చి"పోయినవని అర్థం

ఒకటి, రెండు మార్లు "మయోకార్డియల్ ఇన్‌ఫార్‌క్షన్" ఏర్పడగానే హృదయ కండరాలు చాలా బలహీన స్థితిలో ఉంటాయి ఆ కండరాలకి రక్త సరఫరా పూర్తిగా ఆగిపోతే మొదటిసారి అయినా రోగికి ప్రమాదమే ! అటువంటి స్థితిలో రెండవసారి నుంచీ, ప్రతిసారీ ప్రమాదమే !

— డా॥ కె. వెంకటేశ్వరరావు

---

# వెతుక్కోవాలి!

వాళ్ళిద్దరూ ఆ ప్రశ్న ఎక్స్‌పెక్ట్ చెయ్యనట్టు మొహాలు చూసుకున్నారు.

తర్వాత తెల్లచొక్కాని పక్కకునెట్టి పచ్చషర్టు తొడిగి, కొద్దిగా శుభ్రంగా కన్పిస్తున్న రెండో కుర్రాడు ముందుకొచ్చేడు

"మేం ఎవరో నీకు అనవసరం — ముందు మేం చెప్పినట్టు చెయ్యి"

అంటూ చెయ్యి ముందుకు సాచి సునంద మీదికొచ్చేడు తన మీదికొస్తున్న చెయ్యిని చూసి కెవ్వుమని పరుగెత్తబోయింది సునంద

ఇద్దరూ చెరోపక్కా అడ్డంగా నిల్చున్నారు

"ఇష్— అరవకు! ఆ బేగిలా ఇవ్వు—"

సునంద హేండ్‌బాగ్ కేసి చూపించి మర్యాదగా అడిగేడు పచ్చషర్ట్

"దేనికి?"

అడిగేసినాక తనకు తెలివిలేదని అనుకుంది సునంద. తెల్ల షర్టబ్బాయి ముందుకొచ్చేడు

"మేం నిన్నేం చెయ్యం— ఆ బేగ్ వోసారివ్వు! చూసి ఇచ్చేస్తాం" రిక్వెస్టింగ్‌గా అడిగేడు

తేలికైన గుండెల్తో ఎగవూపిరి పీల్చింది సునంద.

వీళ్ళు రేప్‌చేసే రకాలు కారు! హైవే రాబొరర్స్! థేంక్‌గాడ్! ప్రమాదమన్నది తెలీకుండా జరిగితే బాధుండదుగాని—తెలిసితెలిసి జరిగితేనేబాధ— అనుకున్న సునందకి ఎక్కడ్లేని ధైర్యం, ఎడ్వెంచరస్ స్పిరిట్ వొచ్చేసేయి అసలే కుర్రాళ్ళు—అందులోను అనుభవం లేనట్టు కన్పించడంతో ఆమెకు వాళ్ళు తను ట్యూషన్ చెప్పే పిల్లల్లాగా అన్పించేరు

అందులోనూ ఆమె హేండ్‌బేగ్ స్వంత ఆమెకే తెల్సు!

"ఎందుకియ్యాలి నేనీ బేగ్ మీకు ? మీకు నేనేమన్నా అప్పా!" అంది ధైర్యంగా

అనుకోని సునంద ప్రశ్నకు తెల్లషర్టబ్బాయి మొహం తెల్లబడి మళ్ళీ ఎర్రబడింది

"మర్యాదగా ఇస్తావా ? ఇవ్వవా ?" గొంతు మార్చి, పళ్ళ బిగించి, కళ్ళుమూసి, నోరు విట్లించి అరిచేడతను—

"ఇవ్వకపోతే ఏం చేస్తారు?"

"ప్లీజ్ ! మీరిచ్చేయండి. మా చెక్రీ అసలే కోపిష్టి. వాడేం చేస్తాడో వాడికే తెలీదు మీ సేఫ్టీ కోసం చెప్తున్నాను ఇచ్చేయండి వోసారి చూసి ఇచ్చేస్తాడు."

వెలవెలబోయిన తెల్లషర్ట్‌కి సపోర్ట్ ఇస్తూ పచ్చషర్టు చెప్పుకొచ్చేడు

వెంటనే వాళ్ళిద్దరూ అమాయకులూ, కార్య శూన్యులూ అని తేల్చేసుకుంది సునంద

దార్లు కొట్టి డబ్బు సంపాదించేవాళ్ళు పేర్లు కూడా చెప్తారా ఎక్కడైనా ? కనీసం చెప్పకూడదని కూడ తెలిసినట్టు లేదు పొరబాటున అన్నా అది గుర్తించినట్టూ లేదు

"ఊ ! మర్యాదగా ఇచ్చెయ్."

సహనం పోయినట్టు సునంద మీదిమీది కొచ్చేడు చెక్రీ అనబడ్డ తెల్లషర్టబ్బాయి.

ఇక బెట్టుచేస్తే ఏం చేస్తాడోనని —

"ఆగండి ! నేనే ఇస్తాను" అని తీసి అతని చేతికిచ్చింది సునంద

చెక్రీ కత్తి జేబు లోపల దాచేసి ఆమె వూదా కలర్ బేగ్‌ని వీధిలైటు కిందుంచి వోపెన్ చేసి చూసేడు.

చెయ్యెత్తి కలబెట్టి వొచ్చిన వాటిని పైకెత్తిన అతని మొహం చూసి లోపల నవ్వుకుంది సునంద.

అతని చేతినిండా రంగురంగుల బలపాలు— వాటి పొడి వాటిని చూసి దీర్ఘంగా నిట్టూర్చి లోపలికి తోసేసి మళ్ళీ కలబెట్టి చూసేడు

ఫేస్ పౌడరూ, తిలకం బొట్టు, పక్కపిన్నులూ, చాక్లెట్ కాగితాలూ వరసగా పైకొచ్చేయి

చూసి చూసి విసుగొచ్చిన చెక్రీ బేగ్ పచ్చ షర్టుకిచ్చి —

"నువ్వు చూడ్రా" అన్నాడు.

పచ్చ షర్ట్‌కి మహాతెలివి—

గుడ్డివెల్తురు పరచుకున్న రోడ్‌మీద చదునుగా వున్న ప్లేస్ వెతికి బేగ్‌లో వున్నదంతా బోర్లించేడు. పైసా కూడా రాల్లేదు కిందికి ఏదో గొణుక్కుంటూ ఇద్దరూ కల్సి కిందపడ్డ చిన్నచిన్న వొస్తువులన్నీ తీసి బేగ్‌లో పోసేరు. చేతిలోని పొట్లాన్ని గుండెలకానించుకుని నిలబడ్డ సునంద నవ్వాపుకోలేక అవస్థపడ్తోంది చెక్రీ ఆయాసంగా లేచి బేగ్ ఇవ్వబోయి మళ్ళీ వెనక్కు తీసుకున్నాడు

"ఆ పేకెట్ ఏవిటి?"

"ఇదా— బ్రెడ్డు— మా తమ్ముడికి-- జ్వరమొచ్చిందని" తడబడుతూ చెప్పింది

బేగ్ ఆమె చేతికిచ్చి పేకెట్ లాగి వాసనచూసి ఆమె చెప్పింది నిజమని తెల్సుకున్నాక అతను తిరిగి ఇచ్చేసేడు. "సారీ సిస్టర్! ఇంకెళ్లిపొండి మీరు" వోడిపోయిన మొహంతో చెక్రీ సందుకేసి చూపి వెళ్ళిపొమ్మన్నట్టు సైగచేసేడు

విజయగర్వంతో రొట్టెనో చేత్తో పట్టుకుని చిందరవందరగా వేసేసిన వొస్తువుల్ని బేగ్‌లో సర్దుతూ ఆ ఇద్దరబ్బాయిలకేసి పరమాయింపుగా చూసింది

వాళ్ళిద్దరూ అపర దేవదాసుల్లా వీధి దీపం స్థంభానికున్న తిన్నెమీద దిగాలుగా అటూ ఇటూ కూర్చున్నారు. కుక్కలొకటే తక్కువ— అనుకుంది సునంద

"వెళ్ళిపోండి సిస్టర్!" పచ్చషర్ట్ కూడా వీడ్కోలు చెప్పేడు.

ఐతే సునందకి వాళ్ళ దీనవదనాల్ని చూస్తూ వెళ్ళబుద్ధికాలా చూడబోతే చదువుకున్న పెద్ద మనుషుల్లా వున్నారు — ఈ ఖర్మేమిటో ?

లోపల పేగులు ఆకలేయని పీకి పరిగెత్తమంటున్నా ఆగి వాళ్ళిద్దరికేసి మళ్ళీ చూసింది




**విజయ సాధనలో**
**తళ తళ మెరిసే తెలుపు!**

"చూడండి బాబూ! మీరు నన్ను సిస్టర్ అన్నారు సారీ చెప్పేరు, బాగుంది. కాని ఇలా చెయ్యడం తప్పని మీకు తెలీదూ?" మృదువుగా అడిగింది

"ఏం చెయ్యం సిస్టర్? తప్పో — ఒప్పో పొట్ట పోసుకోవాలిగా" ఖాళీ అన్నట్టు తన పొట్టను తడిమి చూపించేడు చ్రెకీ

"పొట్ట పోసుకోవాలంటే ఇదేనా మార్గం?"

"ఏం చెయ్యం మరి! చదువుకున్న మొహాలం! కూలీనాలీ చెయ్యడానికి నామోషీ అటుంచి, పనసలు చేతకాదు"

"దార్లు కొట్టేందుకు నామోషీ లేదా? రేపు పోలీసులు పట్టుకుంటే నామోషీ రాదా?"

చ్రెకీ తలొంచుకుంటే — పచ్చషర్ట్ మాత్రం

"ఈ బ్రతుక్కన్నా జైలే నయం" అని సన్నగా గొణిగాడు

"ఏం చదివేరు మీ ఇద్దరూ?'

"వాడు బి. ఇ. నేను ఎమ్మెస్సీ"

"అలాగా! ఉద్యోగం దొరకలేదన్నమాట"

"దొరకడమేంటి సిస్టర్? మేం చదువుకునే టప్పుడు క్లాస్‌లో మా క్లాస్‌లో మా మాస్టర్లే — మీరంతా చదువుతున్న నిరుద్యోగులు అని చెప్పేవారు అలాగే తయారయ్యాం మేం ఏళ్ళు గడుస్తున్నా రాదు ఏ ఆఫీస్‌కి పోయినా లంచాలు, రెకలు. ఉన్నవాళ్ళిస్తారు—లేనివాళ్ళేం చేస్తార?"

పచ్చషర్ట్ ఏడుపు గొంతుకతో అన్నాడు

"మీకు అమ్మా—నాన్నా?"

"ఆహా— వున్నారు— చదివించిందంతా చాలా బాబూ! మాకింత పెట్టాల్సింది పోయి మమ్మల్ని పీక్కుతింటున్నావని — ఇంట్లోనుంచీ పరోక్షంగా గెంటేస్తున్నారు"

"ఐతేమాత్రం — మార్గం ఇదా? తప్పుకదూ తమ్ముడూ?" అనునయంగా అడిగింది సునంద

"ఏం తప్పు? మాకు నెలల్తరబడి తిండిలేదు అప్లికేషన్లకయినా డబ్బు లేదు. ఏం చేస్తాం? ఏం చెయ్యగలం? ఇదిగో! ఈ కత్తుల్తో వాడ్ని నేను, నేనువాడ్ని పొడిస్తే తప్ప ఈ సమస్యలుపోవు!"

"ఛ—ఛ— అవేం మాటలు?"

నొచ్చుకుంటూ చూసిన సునందని చూసి నవ్వేడు చ్రెకీ

"ఇవన్నీ మాటలు కాదక్కా! హృదయాక్రోశం! దేశంలో మమ్మల్నెవరు పట్టించుకుంటున్నారు? మేం దేన్ని పట్టించుకోవాలి? ఏం చూసుకొని బ్రతకాలి—ఐనా మీకిదంతా ఎందుకు? సారీ ఫర్ ద ట్రబుల్. పొద్దుపోయింది మీరికవెళ్ళిపోండి! మీ దగ్గరే రూపాయో దొరికితే ఈరాత్రికన్నా అంత అన్నం తినాలని ట్రై చేసేం. కాకపోతే అందర్నీ ఎదిరించే ధైర్యం మాకూ లేదు. రోజూ మీరీ సందులో వొక్కరే వొస్తారని ముందే తెల్సు మాకు— మీ ఇంటి దగ్గర క్వార్టర్స్‌లోనే మేముండేదీనూ. వెళ్ళండక్కా"

చ్రెకీ ఎంత బలవంతం చేసినా సునంద అక్కడ్నుంచీ కదల్లేదు "చూడు బాబూ! నేనొకటి చెప్తా విను! నాకిప్పుడు 30ఏళ్ళు దాటుతున్నాయి. నేను మీ అంత వున్నప్పుడు నాకూ మీ ప్రాబ్లమే వొచ్చింది నిజం చెప్పాలంటే మీకన్నా హీనం!

# వెతుక్కోవాలి!

నేను బియ్యేస్సీ పాసయ్యేక నాకు పెళ్ళి చేసేందుకు ఇంట్లో మా వాళ్ళదగ్గర పైసా కట్నం లేదు -- కట్నం లేకుండా చేసుకునేందుకు నేనెవర్నీ ప్రేమించ లేదు పెళ్ళి లేకపోయినపుడు జాబన్నా చేసి మా వాళ్ళని ఆదుకోవాలని వూరూరా తిరిగేను కానీ నాకోపట్టాన దొరకలేదు మగవాళ్ళ కాబట్టి మీరు దార్లన్నా కొడ్తున్నారు— నేనలాటివి చెయ్యలేనే ఎందరో కాళ్ళా చేతులూ పట్టుకున్నా లాభం లేకపోయేది పట్టెడన్నం లేకుండా నేనే కాదు మా ఇంట్లో వాళ్ళంతా ఎన్నో నెలలున్నాం ఆ బాధలకు తట్టుకోలేక ఆత్మహత్య కూడా చేసుకోవాలనుకున్నా నప్పుడు కానీ తిరగ్గా తిరగ్గా ఈ వూర్లో చివరికి నాకు స్టెనోగా వో పోస్ట్ దొరికింది. తర్వాత ట్యూషన్లు వెతుక్కున్నాను అప్పట్నుంచీ నేనే మా చెల్లెళ్ళనీ, నీలాటి వోతమ్ముడ్నీ పోషిస్తున్నాను జీవితంలో నాకంటూ ఏ సుఖం లేకున్నా — నా వాళ్ళను పోషించడమే నాకు సంతోషం—"

"ఐతే ఏమంటావక్కా" అన్నాడు చ్రెకి

"చెప్తా విను— ఇదిగో ఇలా చూడండి—"

లైటుస్తంభం తిన్నెమీద కూర్చున్న వాళ్ళిద్దరి ముందూ తన హేండ్‌బేగ్ తీసి చూపింది.




"ఇదేంటి?"

"మీ బ్యేగూ" అన్నారిద్దరూ వింతగాచూస్తూ

"ఔనా! ఈ బేగ్‌లోనుంచీ మీరిద్దరూ డబ్బు తీసుకోవాలని ప్రయత్నించేరు--ఔనా?"

"ఔనూ"

"కానీ ఎలా? చూడు చ్రెకీ! నువ్వేం చేసేవు! ఇలా చెయ్యెత్తి కలబెట్టి వొచ్చిన వొస్తువుల్ని చూసి వొదిలేసేవు—ఔనా?"

"ఔను" తలూపేడు చ్రెకి.

"తమ్ముడూ నీ పేరు" పచ్చ షర్ట్‌ని అడిగిందీమాటు.

"మణి."

"చూడు మణీ! డబ్బుని బేగ్‌లో నుంచీ తియ్యాలంటే నువ్వేం చేసేవు? బేగ్‌ని ఇలా బోర్లించి చూసేవు—ఔనా?"

"ఔను"

"కాని—బేగ్ నుంచీ డబ్బుతీసే పద్ధతి అది కాదు తమ్ముడూ! నేనైతే ఏం చేస్తానో తెల్సా? మీలా బోర్లించి, కలబెట్టి వొదిలెయ్యను. వెతుక్కుంటాను. ఏదీ—ఇటు చూడండి" అంటూ వాళ్ళముందు బేగ్‌పెట్టి దాన్లో వో మూలగా కన్పించకుండా వున్న మరో జిప్‌లేని చిన్న అర చూపించి — దాన్లోంచి వో 5 రూ॥ నోటుని బైటికి తీసింది సునంద.

చ్రెకీ, మణీ వూపిరి పీల్చడం కూడా మరిచి చిత్తరపోయినట్టు ఆమెకేసి, ఆమె చేతిలోని నోట్‌కేసి మార్చి మార్చి చూసేరు

'చూసేరా? చేతికివ్విన సంచీ నుంచీ డబ్బు తియ్యలేకపోయేరు మీరు ఇక జాబ్ కోసం సక్రమంగా ప్రయత్నించేరంటే నేనమ్ముతానా? ఏం చేసుంటారు మీరు చెప్పనా? పాసైగానే పేపర్ చూసి నాలుగు చోట్లకి అప్లయ్ చేసుంటారు. ఇంటర్వ్యూ కార్డు వొచ్చుండవు వొచ్చిన చోటున మీరు సెలక్ట్ ఐయుండరు దాంతో వేదాంతం! హై రాబింగూ! అంతేనా?"

"కాదక్కా! మేం బాగానే ప్రయత్నించేం"

మణి తలొంచి మెల్లిగా అన్నాడు

"ఏదీ! నా మొహం చూసి చెప్పూ? ఊహూ అబద్ధాలు! సంచీలోంచి డబ్బు తీలేనప్పుడే తెల్సింది నాకు! ఉద్యోగాలు మనం నిల్చున్నచోటికి పరిగెత్తుకుంటూ రావు మనం నడిచినచోటు దగ్గర ఆగిపోయీ వుండవు తమ్ముళ్ళూ! ఇలా కలబెడ్తే చేతికందవు! అలా బోర్లిస్తే దార్లిపడవు! ఈ సంచీలో ఆ మూల ఎవరికీ కన్పించకుండా ఆ చిన్న అర వున్నట్టే, ఏమూలో ఎవరిక్కావల్సిన వుద్యోగం వుండనే వుంటుంది నువ్వు చెయ్యాల్సిందంతా — వెతుక్కోవడమే తమ్ముడూ! వొక చోటు కాదు— వొక మూలకాదు! వూరు, నగరం, దేశం, ప్రపంచమంతా వెతకాలి, గాలించాలి ఇంత పెద్ద ప్రపంచంలో మీక్కావల్సిన వో చిన్న వుద్యోగం, కడుపు నిండేందుకింత తిండే దొరక్కపోతుందా? ఐడోన్ట్ బిలీవిట్. మీరు అన్ని వూర్లూ, అన్ని చోట్లూ తిరిగేరా? సరిగ్గా ప్రయత్నం చేసేరా? చేసుంటే మీ మొహాలింత అసూయకంగా వుండవ్"

చ్రెకీ, మణీ జవాబియ్యలేనట్టు సునందకేసి తప్పుచేసిన వాళ్ళలా చూస్తూండిపోయేరు

"పిచ్చిపిల్లలూ—మీరూనూ ఏమీ చేతగానట్టు దేశాన్ని, ఎవర్నో తిట్టడం— దేశమంటే ఎవరూ? మీరు కాదూ? అలా దీనంగా కూర్చుంటారేం? చేస్తామక్కా అనరేం?"

"చేస్తామక్కా" వాళ్ళిద్దరూ కృతజ్ఞతగా ఆమెకేసి చూసేరు.

"అదీ మాటంటే! ఇదిగో ఈ 5రూపాయలు వుంచండి!"

"వొ—వొద్దక్కా" అన్నాడు చ్రెకి.

"పరేం ఫర్వాలేదు! వుంచుకో. ఇదిగో మణీ! ఆకలన్నావు కదూ? ఈ రొట్టె తిను" చేతిలోని పొట్లానికున్న దారాన్ని విప్పేసి, లార్జ్‌సైజ్ రొట్టెని అతని చేతుల్లో పెట్టేసింది

"వొద్దక్కా! మీ తమ్ముడికి జ్వరమన్నావు!" మణి నొచ్చుకున్నాడు

"ఐతే ఏం? మీరు నా తమ్ముళ్ళు కారూ ఇప్పుడు? తినండి బాబూ! తిని ఇంటికెళ్ళి, రేపట్నుంచీ సరిగ్గా జాబ్ కోసం వెతికే ప్రయత్నం చేయండి! సరేనా?"

"సరే—" తలలూపేరిద్దరూ.

"వొస్తామరి! లేటైంది కదూ? ఇంట్లో కంగారుపడ్తుంటారు! లేకుంటే మీకింకా చెప్పేదాన్నే—ఆల్ ద బెస్ట్" అనేసి వాచ్ చూసుకుంటూ గబగబా వెళ్ళిపోతున్న సునందనీ — దగ్గరున్న రొట్టెనీ కళ్ళనీళ్ళతో చూస్తూ కూర్చున్నారు వాళ్ళిద్దరూ ★

చాలా వింతగా వుంటుంది. తన భార్య హత్యానేరం తనమీద మోపబడి, శిక్ష విధించడానికి కోర్టు సిద్ధమయినా నోరు మెదపని ఓ ఆదివాసి చుట్టూ ఈ కథ అల్లబడింది. ప్రభుత్వం ఈ ముద్దాయి తరపున వాదించేందుకు నియమించిన క్రిమినల్ లాయర్‌కి ఎంత ప్రయత్నించినా మౌనమే ఎదురవుతుంది. ఎటునుంచి ఆధారాలు దొరకని పరిస్థితిలో, న్యాయం సరిగా జరగడంలేదని అంతరాత్మ ఆక్రోశిస్తున్నపుడు సత్యాన్వేషణకు అతను పడిన మధన, నిజం తెల్సుకున్న తర్వాత అతను అనుభవించిన మనఃక్షోభ, ఆఖరికి కథ ముగిసినతీరు చూస్తే గొప్ప కథాబలంతో, పటుత్వంగా కథను నడిపిన దర్శకుడు గోవింద్ నిహలానీ తగిన సత్కారాన్నే అందుకున్నాడనిపిస్తుంది. నేటి రగులుతున్న సమస్య 'రేప్' నాధారంగా తీసుకుని రూపొందించిన ప్రత్యేక తరహా చిత్రంగా 'ఆక్రోష్' ప్రశంసలు పొందింది.

## బాలింత్ ఫాబిన్ మీట్స్ గాడ్

పెళ్ళి చేసుకుని ఇద్దరు కొడుకుల్ని కన్న తర్వాత యుద్ధానికి వెళ్ళడం బాధాకరమైన విషయమైతే, యుద్ధభూమిలో సంవత్సరాల తరబడి ఇరుక్కుపోయి భయంకర స్మృతులతో వెనక్కిరాడం ఇంకా దైన్యమయిన విషయం. కానీ అలా తిరిగి వచ్చిన బాలింత్‌ఫాబిన్‌కి విషాదవదనంతో తన భార్య ఇచ్చిన స్వాగతం, అంతులేని విధంగా ఆవిడ దుఃఖం ప్రకటించిన తీరు అతనికి అర్థంకాని సమస్యలు. అసలేం జరిగిందో ఎవర్నడిగినా చెప్పరు. కొడుకులు కూడా తెలీనట్టు వుంటారు. ఇంతలో భార్య వున్నట్టుండి కన్ను మూయడం, నలుగురి మధ్య వుండగా 'నీ పెళ్ళాం గురించి నీకు తెలీదా! వాజమ్మా!! నీ నటన ఆపు!'' అని ఓ ఇన్‌కీపరు హేళన చేయడం ఫాబిన్ మనస్సుని విపరీతంగా గాయపరుస్తాయి. ఇంతలో తన కొడుకు చేతిలో ఆ మర్నాడే ఇన్‌కీపరు హత్య చేయబడినట్టు తెలిసిన ఫాబిన్‌కి అసలు జరిగిన గొడవ, జరుగుతున్న

పాకిస్తానీ ''బంధిష్''





'ది అన్‌సీన్ పోల్డర్స్ పేటెంట్ లెదర్ షూస్'

# అవార్డు చిత్రాల ఇతివృత్తాలు

[35 వ పేజీ తరువాయి]

సంఘటనలు అర్థంకాక తనక్కావల్సిన జవాబులు రాబట్టుకునేందుకు నేరుగా దేవుణ్నే చేరుకోవాలని చర్చి గంటకి కట్టిన తాడుతో వురేసుకుంటాడు. పరాయి మగాడితో అక్రమ సంపర్కం పెట్టుకున్న స్త్రీ నాధారంగా చేసుకుని నడిచిన ఈ కథలో బాలింత్ ఫాబిన్‌గ గాబర్‌కొనెజ్ నటన అద్భుతం, అపూర్వం అంటే అతిశయోక్తి కాదేమో! ఇది జోల్టన్ ఫాబ్రి నిర్మించిన హంగరీ చిత్రం.

## సబీనా

నటనా వైదుష్యంతో మెప్పించడానికి కథాబలం జోడు కానవసరంలేదని నిరూపించిన ఈ చిత్రాన్ని స్వీడన్, స్పెయిన్ దేశాలు సంయుక్తంగా నిర్మించాయి. ఇద్దరు యువకులు తనని గాఢంగా ప్రేమిస్తుంటే, ఒకరిమీద ఒకరు ఈర్ష్యాద్వేషాలు పెంచుకుని ఒకర్నొకరు చంపుకోడానికూడా సిద్ధమౌతుంటే ఎటూ చెప్పలేని స్థితిలో ఆ ఇద్దరి మధ్య నలిగి మనస్తాపం చెందిన ఓ యువతి కథకు స్పెయిన్‌లో అనాదిగా వున్న పుక్కిటి పురాణగాధను జోడించి, పురుషుడు పతనం కాడానికి అతీతమైన కామవాంఛే కారణం అని తెలియజెప్పిన చిత్రం ''సబీనా''లో స్వీడిష్ తార ఏంజెలా మొలీనా కథానాయిక పాత్రలో మొత్తం చిత్రానికే ప్రాణం పోసే విధంగా నటించి 'ఉత్తమ నటి' అని ముందుగానే మెప్పును పొందింది.

## వెనీషియన్ లైస్

మధురమైన సంగీతం, మృదువైన హాస్యం, ఆసక్తికరమైన చిన్ని కథలో అద్భుతంగా మేళవించితే ఆద్యంతం ప్రేక్షకుల్ని మంత్రముగ్ధులుగా చేయవచ్చని రుజువు చేసిందీ చిత్రం. 'పిట్టకొంచెం— కూత ఘనం' అన్నట్టు వయసు పదిహేనే — కానీ తన పూటుమీద పాట మొదలెడితే ఎవరైనా తనకి దాసోహం అనక తప్పదు అనే విషయం రెనాటోకి తెలుసు. దీనికి తోడుగా, అరక్షణంలో అరవై అబద్ధాలు, అతికినట్టు చెప్పే నేర్పుకూడా తన దగ్గరుంది. ఈ ప్రజ్వలనాయంలో, తనకెవ్వరూ దిక్కులేదన్న బాధని మరచి, ఏ వూరెడితే ఆ వూర్లో ఓ దంపతులను, పిల్లలులేనివాళ్ళని, ఎన్నుకుని వాళ్ళని మచ్చిక చేసుకుని, వాళ్ళ పెంపుడు కొడుకులా సబ్బం గడిపేసుకుపోడం రెనాటో నిరంతరం ఆడుతున్న గమ్మత్తైన ఆట. తనవల్ల మోసపోయిన దంపతులందరూ నిజాన్ని తెలుసుకుని తనకు పాఠం చెప్పబోయిన తర్వాత కూడా తెలివిగ తప్పించుకుని తన ఆట సాగిస్తూపోడం రెనాటో ప్రత్యేకత. ఈ ఇటలీ చిత్రం దర్శకుడు స్టీఫెన్ గోల్డా చేబట్టిన మొదటి చిత్రం ఐనా ఉత్తమ దర్శకుడుగా ఆయన ఎన్నిక చేయబడినప్పుడు మాత్రం ఎంతో ఆనందమే కలిగింది!

## లవ్ బ్రూడ్ ఇన్ ది ఆఫ్రికన్ పాట్

పై అంతస్తులో వున్న కుటుంబానికి చెందిన నాగరీకంగా వుండే అమ్మాయి గుడిసెల్లో కాపురం వుండే చదువురాని అబ్బాయిని ప్రేమించడం, తల్లిదండ్రులను కాదని ప్రేమించినవాణ్ణే పెళ్ళాడ్డం, అనక అతగాడు ఓ సంఘటనలో ఆమెను అపార్థం చేసుకుని వదిలేస్తే ఆ అమ్మాయికి పిచ్చెక్కిపోడం — చివర్లో అతడు నిజం గ్రహించి పశ్చాత్తాపం చెందడంతో ముగిసే ఈ కథలో పెద్దగా ప్రత్యేకమేదీ కనిపించకపోయినా ఘనా దేశంలో ఇటీవలే వూపిరిపోసుకోనారంభించిన చలన చిత్ర పరిశ్రమకు ప్రోత్సాహమివ్వాలని, కథాగమనంలో మంచి నేర్పును, శ్రద్ధను చూపిన దర్శకుడు క్వాఅన్సాకు ఉత్సాహాన్నివ్వాలని జ్యూరీ ప్రత్యేక అవార్డును ఈ చిత్రానికిచ్చినట్టు గ్రహించవచ్చును.

["సత్యప్రభ"]

''వుమెన్ ఎట్ వార్''



# పాలాక్షుని డైరీ

## నిజం చెప్పే...!

జకోస్లవేకియాకు చెందిన 57 ఏళ్ళ మార్గ్డభక అనే ఆవిడ తాను బ్రాస్టిస్లావాలో నివసిస్తున్నట్టు, తన వయస్సు పదిహారేళ్ళేననీ, తానొక అందమైన ఎర్రని జుట్టు, నీలి కళ్ళు వున్న యువతిననీ తనకు బోలెడు ఆస్తి వున్నదనీ, వివాహం చేసుకోదలచిన వాళ్ళు అప్లికేషనులు పంపమనీ వో పత్రికా ప్రకటన చేసిందట. దానికి వో పుంజీడు అప్లికేషన్లు మాత్రమే వచ్చాయట. దానితో ఆవిడకు తిక్కరేగి తన నిజస్వరూపాన్ని ప్రకటించి తను విధవరాలుననీ, తనకు వివాహేచ్ఛ కలిగిందనీ కూడా మళ్ళీ ప్రకటన యిచ్చే సరికి అప్లికేషనులు కుప్పలు కుప్పలుగా వచ్చాయట. ఈ అప్లికేషనులో చాలామంది వివాహితులు తమ భార్యలకు విడాకులిచ్చేస్తామని కూడా హామీని జోడించారట.

## బోర్డు మహిమ!

అమెరికాలో 21 ఏళ్ళ బ్రెటి వెక్వర్త్ అనే ఆతనిని అతని ప్రేయసి పామేక్రవుల్ భగ్న హృదయుణ్ణి చేసి చక్కా పోయిందట. దాంతో అతను తన చితికిన హృదయ వీణను బాగు చేసుకుంటూ తన యింటి ముందు "భగ్న హృదయుడు. కానీ శరీరం చక్కని స్థితిలోనే వుంది. అందమూ, శక్తి, ఆరోగ్యమూ బేషుగ్గా వున్నది" అని వో బోర్డు రాసి తగిలించాడట. దాంతో రోజూ అతనికి దేశంలోనలుమూలల నుంచీ సానుభూతి ఉత్తరాలూ సానుభూతి పోను వోదార్పులూ కోకొల్లలుగా ఆరంభించాయట. ఇవన్నీ అనేక వయస్సుకు చెందిన ఆడవారి వద్దనుంచి వచ్చినవేనట. శృతి చెడిన అతని హృదయవీణ సరి చేయగలమని చాలామంది హామీలు యిచ్చారట. ఫ్లోరిడాలోని ఆర్లెండో నుంచి వో ధనసుందరి తనను వచ్చి చూసుకోవాల్సిందనీ, అందుకయ్యే విమానం రాకపోకల ఖర్చు తానేభరిస్తాననీ, తానాతనివీణను నిశ్చయంగా శృతి చేసి భగ్న హృదయాన్ని రిపేరు చేయగలననీ హామీ యిచ్చిందట.

## కౌగిలింతల మహత్తు!

కెనడాకు చెందిన డాక్టరు వర్జీనియా సతిర్ అనే ఆవిడ మనిషి శరీరంలోని ఒకరకమైన నిస్పృహ, నిస్త్రాణ, వైరాగ్యం వంటివి పోడానికి, శరీరం వుత్తేజం పొందుతూ ఉండాలనీ, అటువంటి వుత్తేజం పొందడానికి కవుగిలింత చక్కగా పని చేసుందనీ ప్రకటించారట. ఈవిడ తెరపిస్ట్‌గాక, సైకియాట్రిస్టునట అంతేగాక మానవత్వం—శరీరతత్వం మీద అనేక పుస్తకాలు వ్రాశారట. నాలుగు వేల మంది డాక్టర్లు కూడిన అమెరికన్ ఆర్థో సైకియాట్రిస్ట్ ఏసోసియేషను సమావేశంలో మాట్లాడుతూ రోజుకు కనీసం నాలుగు కవుగిలింతలు మనిషిని దైనందిన కార్యక్రమంలో వుషారుగా వుంచుతాయనీ, ఎనిమిదయితే మంచిదనీ, పన్నెండు కవుగిలింతలు చాలా శ్రేష్టమనీ ఆవిడ నొక్కి వక్కాణించారట.

## హృద్రోగానికి చిట్కా!

ఫిట్స్‌ఫా నగరానికి చెందిన సరోకా ఆసుపత్రిలో హృదయ రోగ చికిత్సలో పేరు పొందిన డాక్టరు మొర్టిసా లెరిన్ అనే ఆయన హృదయ రోగం (గుండె జబ్బు) రాకుండా వుండాలంటే వో బహు చక్కని వైద్యం చెప్పారట. ప్రతిరోజు ఒక గ్లాసుడు వైన్ గానీ, ఒక సీసాడు బీరు కానీ తాగుతూ, ఎక్కువగా స్త్రీ సంభోగం వుండేలా చేసుకుంటే గుండె జబ్బు ఆ మనిషి జోలికిరాదట.

## ముఖ్యమంత్రి సతీమణికి జరిమానా!

హర్యానా ముఖ్యమంత్రి భజన్‌లాల్ గారి భార్య పార్కులోని పిల్లల రైలులో పిల్లల ప్రోత్సాహం మీద గమ్మున ఎక్కి కూర్చునే సరికి టికెట్టు చెక్కింగుకు వచ్చినాతను ఆమె వద్ద టిక్కట్టు లేని కారణాన్న నూరు రూపాయలు ఫైను కట్టి తీరాలని అన్నాడట. మొదట్లో కోపం వచ్చినా, తమాయించుకుని అది పిల్లలు సరదాకి తన మీద వేసిన జోకుగా తీసుకుని ఆ జాస్మిదేవి నూరు రూపాయలు అపరాధం కట్టేశారుట.

## బతికేందుకు బడి పంతులు!

షాహబాదుకు చెందిన దందోటి అనే వూరిలోని వో స్కూలు టీచరు పక్క గ్రామం నుంచి వారానికోసారి వచ్చి పిల్లలకు పాటాలు చెప్తాడట. అదైనా వో గంట సేపు స్కూల్లో వుండి, వెళ్లేటప్పుడు పిల్లలవద్ద కూరగాయలు వసూలు చేసుకు చక్కా పోతాడట. బద్ధకంగా వుంటే పదిహేను రోజులుకోసారి వస్తాడట. ఇదేమని ఆ వూరువారు నిలదీస్తే పెద్ద శలవు పెట్టేసి వారిని బెదిరిస్తాడట. అయ్యో! బ్రతుక లేక బడిపంతులు అనే నానుడి యీ నాడు చెల్లదు.

## హత్యకు దారితీసిన దొంగాట!

కర్నాటక రాష్ట్రానికి చెందిన మాంఫిర్ అనే వూరులో కొంతమంది చిన్న పిల్లలు దొంగాట ఆడాలని నిర్ణయించుకుని, సినిమాలలో మాదిరి దోపిడీ దొంగల ఆట ఆరంభించారట. ఆ ఆటకు కావాల్సిన దీపావళి పిస్తల్సు తెచ్చుకున్నారుట. వో కుర్రాడు చేతిలో పిస్టలుతో హిహ్హిహ్హీ అని వికటంగా నవ్వుతూ పెద్ద దొంగలా నటిస్తూ వో యింట్లో ప్రవేశించి, అక్కడ పసిపిల్లను ఒడిలో కూర్చో పెట్టుకుని ఆడిస్తున్న పదేళ్లమ్మాయిని చూసి, నీ మెడలో నగలు తీసి యివ్వు. లేకపోతే పేలుస్తా, చంపుతా అని తన చేతిలో పిస్టలు పేల్చాడట. ఆ గుండు దెబ్బకు ఆ పిల్ల విలవిల్లాడి రక్తపు మడుగులో పడి, చనిపోయిందట. ఆట పిస్టలు అనుకుని యింట్లో వున్న నిజం పిస్టలు తెచ్చాడటా కుర్రాడు పాపం!

## కత్తిగామారిన నీటి తగాదా!

సేలంకు చెందిన అయోధ్యా పట్టణంలో 45 ఏళ్ల నల్లతంబి అనే అతనికి, అతని పక్క పొలం సొంతదారు కుప్పుసామికి నీటి పారుదల విషయములో పోట్లాట వచ్చి, అది కక్షగా మారిందట. నల్లతంబి, అతని కొడుకు గోవిందరాజు సేలం బయలుదేరి పొలాల్లోంచి బస్టాండుకు వస్తుండగా దారి కాసిన కుప్పుసామి నల్లతంబిని కత్తితో కసకస పొడిచి చంపేసి, ఆ రక్తసిక్తమైన కత్తితో నేరుగా పోలీసు స్టేషనుకు వెళ్ళి విషయం చెప్పి లొంగిపోయాడట.



# అపూర్వమైన సువాసన...
# పుష్కలమైన నురుగు....



## మీకే తెలుస్తుంది, యిది
## అత్యుత్తమ* నాణ్యమైనదని.




| | |
|---|---|
| మామూలు ధర | రూ. [illegible]* |
| చెక్ ప్రత్యేక ధర | రూ. 1.88* |

అపూర్వమైన తాజా నిమ్మ సువాసన, దీనిని స్నానానికి వుపయోగించుదామా అనే కోరిక మీకు కలుగ చేస్తుంది.

చెక్ యొక్క పుష్కలమైన నురుగు మీ బట్టలని ఎంతో తెల్లగాను, మరియు ఎంతో ప్రకాశ వంతముగాను చేస్తుంది.

ఈ తగ్గింపు ప్రతి కొనుగోలుకు 6 సబ్బుల వరకు మాత్రమే పరిమితం.



ఇది గ్యారంటీ యివ్వబడిన అత్యుత్తమ నాణ్యతకు చిహ్నం. డిటర్జెంట్ బిళ్ళ కొనే ప్రతిసారి మీరు యీ చిహ్నంకోసం చూడండి.

* పూర్తిగా తృప్తి కలుగనిచో సబ్బును తిరిగియిచ్చి సొమ్మును వాపసు పొందండి.

**చెక్ తో ఉతకండి, తేడా చెక్ చేయండి**

* స్థానిక పన్నులు అదనం.



# వంటలు

## కొత్తిమీర పకోడీలు

కావలసిన వస్తువులు :— బియ్యపుపిండి—3 కప్పులు, మైదాపిండి—1 కప్పు, డాల్డా—50 గ్రా, కొత్తిమీర—3 కట్టలు, అల్లం, పచ్చిమిర్చి, ఉప్పు తగినంత

తయారుచేయు విధానం :— ముందుగా కొత్తిమీర, అల్లం, పచ్చిమిర్చి నూరి ముద్దగా చేసుకోవాలి బియ్యపుపిండి, మైదాపిండిని కలిపి అందులో నూరిన ముద్దను, డాల్డాను వేసి కలపాలి తరువాత మనకు కావలసినంత ఉప్పువేసి, కొంచెం నీటితో ఈ మిశ్రమాన్ని అంతా జంతికల పిండి మాదిరిగా కలుపుకోవాలి తరువాత పొయ్యిమీద బాణలిలో నూనెపోసి కాగినతరువాత, కలిపిన పిండిని చిన్న చిన్న ముద్దలుగాచేసి, ఆ ముద్దలను చేతితో బిస్కెట్ వలె పొడుగ్గా నొక్కి నూనెలో వేయాలి ఎర్రగా వేగిన తరువాత తీసుకోవాలి.

## అవల్ కేక్

కావలసినవి :— పంచదార — అరకిలో, అటుకులు — అరకిలో, మిఠాయి రంగు — కొంచెం, పచ్చ కర్పూరం — కొద్దిగా, బాదం పలుకులు

తయారు చేయుట :— మొదట అటుకులు బాగుచేసి, నాలుగైదుసార్లు బాగా కడగాలి. కడిగేసరికి అవి బాగా నాని మెత్తబడతాయి. అప్పుడు నీళ్లు పిండేసి, ఒక వెడల్పాటి పళ్లెంలో ఆరబెయ్యాలి. అవి గాలికి ఆరి, ఉబ్బుతాయి! అప్పుడు పంచదార తీగపాకం పట్టి అందులో ఈ అటుకులు వేసి, కలుపుతూండాలి. అటుకులు పాకంలో ఉడికి ముద్దగా అయిపోతాయి పచ్చ కర్పూరం, మిఠాయి రంగు అప్పుడు వేసి, బాగా కలిపి, ఒక వెడల్పాటి పళ్లానికి నెయ్యి రాసి, అందులో ఈ ముద్దని వేసి చదును చేసి, ముక్కలుగా కోసుకోవాలి. ఆ తరువాత ఈ ముక్కల మీద మిఠాయిల మీద వేసే ముత్యపు రేకులు, బాదం పప్పు పలుకులు అద్దాలి

— బి. రామలక్ష్మి

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను పాపా!
అన్నారు నాన్నారు !!!"

"నిన్నుకాదురా కుర్రకుంకా...
ఆమాట అన్నది అమ్మనురా!"






విజయ్‌స్ప్రే. మాంసకృత్తులు, విటమిన్లు మరియు ఖనిజ పదార్థాలతో సమ్మిళితమైన శిశు ఆహారం. తేలికగా జీర్ణంకాగలదు, సులభంగా నీటిలో కరుగగలదు. ఆరోగ్యసూత్రాలకు అనుగుణంగా తయారుచేయబడింది. విజయ్‌స్ప్రేను చాలా సులభంగా కలుపుకోవచ్చు. అంతర్జాతీయప్రమాణాలకు అనుగుణంగా తయారుచేయబడిన విజయ్‌స్ప్రే భారతదేశపు పసి పాపలకు చాలా అనువైన శిశు ఆహారం. విజయ్‌స్ప్రే తల్లి పాలవలె తియ్యగా ఉండేట్లు తయారు చేయబడింది.

అవును, మీ పాప ఆరోగ్యానికి డాక్టర్లు సిఫారసుచేసే శిశు ఆహారం... విజయ్‌స్ప్రే!

# విజయ్‌స్ప్రే

కన్నతల్లి అనురాగానికి ప్రతిరూపం

ఆంధ్రప్రదేశ్ పాడి పరిశ్రమాభివృద్ధి కార్పొరేషన్ లిమిటెడ్ వారి ఒక శ్రేష్ఠమైన ఉత్పన్నం (ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ యాజమాన్య సంస్థ)

అమ్మకందార్లు:
స్పెన్సర్ & కం. లిడ్.

FDS APDDC 3059A TEL

### మూడుతరాల మనిషి:

మూడుతరాలు చూచి నాలుగవ తరంలో అడుగు పెట్టిన మహా మనిషి, ప్రముఖ విద్యావేత్త, రాజనీతి శాస్త్ర విశారదుడు, సహకారోద్యమ పితామహుడు, రాజ్యాంగ కోవిదుడు ఆచార్య మామిడిపూడి వెంకట రంగయ్య అస్తమయంతో ఒక్క ఆయక స్తంభమే కూలిపోయింది. ఆయా రంగాలు చిన్నబోయాయి. లాల్, బాల్, పాల్ అనబడే నాయకత్రయంలోని బిపిన చంద్రపాల్ ప్రసంగాలు 1907లో మద్రాసు బీచిలో విన్న తర్వాత, ఎందరెంత బ్రతిమాలినా, బి.ఎ.లో లెక్కల విషయాలలో సర్వ ప్రథముడైనా ఇండియన్ సివిల్ సర్వీస్ పరీక్షకు వెళ్లడం మాని పచ్చయప్ప కళాశాలలో ట్యూటరుగా చేరి, ఉపాధ్యాయ వృత్తే ఉత్తమమని నమ్మిన దేశభక్తుడాయన. 7వ ఏటనే గర్భాష్టమంలోనే ఉపనయన సంస్కారానంతరం సంస్కృతం చదువనారంభించి బంధువుల నిరసనను సరకుజేయని తండ్రిగారి ఆసక్తిపై ఆంగ్లం చదివి, ఏటా బహుమతులు పొందుతూ 1907లో బి.ఎ.లో ఉత్తమోత్తముడుగా ఉత్తీర్ణుడై, 1910లో ఎం. ఎ.లో ఉత్తీర్ణుడైన ప్రతిభాశాలి ఆయన. సర్. ఆర్. వెంకటరత్నంనాయుడుగారి ఆహ్వానంపై మూడు సంవత్సరాలపాటు కాకినాడ పి. ఆర్. కాలేజీలోను, పిదప, 13 సంవత్సరాలు విజయనగరంలో మహారాజ కళాశాలలోను, తర్వాత నెల్లూరులో వెంకటగిరిరాజాకళాశాలకు ప్రిన్సిపాల్ గాను, అనంతరం 1931 నుండి 14 ఏళ్ళ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రాజకీయ శాస్త్రాచార్యులుగాను, పదపడి మూడేళ్ళ భీమవరం కాలేజీ ప్రిన్సిపాల్ గాను పని చేసిన దేశికోత్తముడాయన. 'బొంబాయి విశ్వ విద్యా



హైదరాబాదు నగరంలో 'స్వామీ రామానంద తీర్థ' జీవిత చరిత్ర గ్రంథాన్ని రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో ఆస్థానకవి డా.దాశరధి, రచయిత ఎం.ఎల్. నరసింహారావు.

# హైదరాబాద్ నోట్‌బుక్

తిరుమల రామచంద్ర

లయంలో డాక్టర్ జాన్ వైస్ ఛాన్సలర్‌గా ఉన్నప్పుడు ఆయన ఆహ్వానంపై వెళ్లి ఆ విశ్వవిద్యాలయంలో రాజకీయ శాస్త్ర విభాగాన్ని స్థాపించి రెండేళ్లపాటు ఆచార్యులుగా ఉన్నారు. ఆయన గౌరవార్థం బొంబాయి విశ్వవిద్యాలయం 'ఫెడరేషన్' అనే సంకలన గ్రంథం ప్రచురించింది. 1954 నుంచి మూడేళ్లపాటు ప్రణాళికాసంఘంలో అధికారిగాను, పిదప మూడేళ్లపాటు మద్రాసు ఆకాశవాణి కార్యక్రమాల సలహాదారుగాను పని చేశారు. 1934 నుంచి మరణించే వరకు ఎడ్యుకేషన్ ఇండియా ఆంగ్ల పత్రికకు సంపాదకులుగా వ్యవహరించారు. మరణానికి మూడు రోజులముందు కూడా పొలిటికల్ సైన్స్ అసోసియేషన్ 40వ వార్షిక సమావేశానికి [సెమినార్] వ్యాసం వ్రాసి పంపిన కార్యదక్షులు. సహకార గ్రామీణాభివృద్ధిపై దాదాపు 30 గ్రంథాలు రచించారు. మరణించే వరకు ఆత్మకథ వ్రాసుకొన్నారు. ఫండమెంటల్ రైట్స్, రాజ్యాంగ పరిషత్తు, రాజ్యాంగం, ఎన్నికలు, తదితర రాజకీయాంశాలపై పుంఖాను పుంఖంగా గ్రంథాలు, వ్యాసాలు వ్రాసిన మహా రచయిత. ఇంగ్లీషు పత్రికలో "స్పాట్ లైట్ ఆన్ ది వరల్డ్" అనే ఫీచరును ఆకర్షణీయంగా నడిపిన పత్రికా రచయిత ఆయన. తెలుగు విజ్ఞాన సర్వస్వం సంపాదకులుగా ఉన్నారు. శ్రీ ఎ. వెంకటశాస్త్రితో కలిసి కౌటిల్యుని అర్థశాస్త్రం తెలుగు చేశారు. స్వాతంత్ర్యోద్యమ చరిత్రకు సంపాదకులు. 1945లో జేపీ ప్రసాద్, వంగల శివరాం, గురుముఖ్ నిహాల్‌సింగ్‌లతో కలిసి ఇండియన్ పొలిటికల్ సైన్స్ అసోసియేషన్ స్థాపించారు. ప్రజలలో రాజకీయ సామాజిక చైతన్య విస్తృతికి కృషి చేశారు. కొంత కాలం విజయనగర సంస్థానం దివానుగా పని చేశారు. రాజకీయ అభిప్రాయ భేదాల వల్ల ఆ పదవి త్యజించారు. కాని, విజ్ఞుడైన విజయనగర గజపతి ఆయనకు యావజ్జీవం 200 రూపాయల ఉపకార వేతనం ఏర్పాటు చేసి, ఏడువేల రూపాయలు బహూకరించారు. ఆయన నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా పురిణి గ్రామంలో 1889 జనవరి 8న జన్మించారు. సికిందరాబాద్‌లో 1981 జనవరి 13 ఉదయం 7.40కి కన్ను మూశారు. ఆయన ఏడుగురు కుమారులు, ముగ్గురు కుమార్తెలు, కుమారులందరూ ఉన్నత పదవులలో ఉన్నారు. మూడవ కుమారుడు శ్రీ ఆనందం రాష్ట్ర శాసన పరిషత్తు ఉపాధ్యక్షుడుగాను, రెండుమార్లు రాజ్య సభ సభ్యులుగాను ఉన్నారు. శ్రీ వెంకట రంగయ్య ధన్యజీవి, చరితార్థ చరితుడు. కాని, ఆయన కన్నుమూతతో దేశానికి, ముఖ్యంగా మన రాష్ట్రానికి విద్యా రంగంలో పెద్ద అఘాతం ఏర్పడింది.

## స్వాతంత్ర్య యోధుల మహాసభ :

స్వాతంత్ర్యయోధుల రాష్ట్రస్థాయి మహాసభ జనవరి 17, 18 తేదీలలో జరిగింది. తొలిరోజు సమావేశానికి రాష్ట్రమంత్రి శ్రీ కందుల ఓబుల్ రెడ్డి అధ్యక్షత వహించారు. డాక్టర్ మేల్కోటే ప్రారంభోత్సవం జరిపారు. సమాజంలోని కల్మషాన్ని తొలగించడానికి యువకులు ముందుకు రావాలని ఆయన కోరారు. స్వాతంత్ర్య సమరంలో ఆచార్య రంగా మున్నగువారి సేవలను శ్రీ ఓబుల్ రెడ్డి వివరించారు. రాష్ట్ర స్వాతంత్రయోధుల సంక్షేమశాఖామంత్రి శ్రీ హయగ్రీవాచారి ప్రసంగిస్తూ, స్వాతంత్ర్యం కోసం త్యాగాలు చేసిన వారికి సౌకర్యాలు కలిగించే బాధ్యత ప్రభుత్వందని అన్నారు. రెండవ నాటి సభను విదేశాంగ మంత్రి శ్రీ పి. వి. నరసింహారావు ప్రారంభిస్తూ, పలువురు నకిలీ స్వాతంత్రయోధులు పెన్షనుకోసం ప్రాకులాడుతున్నారని అన్నారు. రెండవనాటి సభకు అధ్యక్షత వహించిన ముఖ్యమంత్రి శ్రీ టి. అంజయ్య తన ప్రసంగంలో స్వాతంత్ర్య సమరయోధుల కోసం సంక్షేమ నిధిని ఏర్పాటు చేయనున్నామని తెలిపారు. కేంద్ర హోంశాఖ సహాయ మంత్రి శ్రీ పెండేకంటి వెంకటసుబ్బయ్య స్వాతంత్ర్యయోధుల సావనీర్‌ను ఆవిష్కరిస్తూ, స్వాతంత్ర్యయోధుల కోసం పార్లమెంటు సభ్యులతో ఒక సంఘాన్ని నెలకొల్పుతామన్నారు. టికెట్టు లేనివారు రైలు ముందెక్కినట్టు నకిలీ స్వాతంత్ర్యయోధులు ఈనాడు పెన్షన్‌కోసం ముందుకువస్తున్నారని మాజీ ముఖ్యమంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డి అన్నారు. రాష్ట్ర స్వాతంత్ర్యయోధుల సంస్థ ప్రధాన కార్యదర్శి శ్రీ సుందరరావు తన నివేదికలో స్వాతంత్రయోధుల ప్రజా సమస్యలకు ప్రాధాన్యం ఇవ్వాలని కోరారు.

## రామానంద తీర్థ చరిత్ర :

శ్రీ నాదిరాజ లక్ష్మీనరసింహారావు రచించిన స్వామీ రామానందతీర్థ చరిత్రను ముఖ్యమంత్రి శ్రీ అంజయ్య జనవరి 22న ఆవిష్కరించారు. ఈ ఆవిష్కరణ సభ స్వామీ రామానందతీర్థ తొమ్మిదవ వర్ధంతి సందర్భంగా స్మారక సమితి, స్వామి సమాధివద్ద ఏర్పాటు చేసిన ప్రార్థన సమావేశంలో జరిగింది. స్వామీజీ స్వాతంత్ర్యయోధులకు సేనాపతి అని, భావితరాలకు మార్గదర్శకుడు అని ముఖ్యమంత్రి ప్రశంసించారు. ప్రారంభంలో స్మారక సమితి కార్యదర్శి శ్రీ గోవిందరావ్ నానల్ స్వాగతం చెబుతూ ప్రతివారు జాతి సమైక్యం కోసం పాటుపడాలని, అప్పుడే దేశం అభ్యుదయ పథంపై ప్రయాణం చేయగలదని అన్నారు. ●

శ్రీ విద్యాధర్మ సభ (న్యూఢిల్లీ) తెలుగువారు ఆ మధ్య ఢిల్లీలో బుర్రకథ త్రయం నిట్టల సోదరులచే నర్తనశాల కథా కాలక్షేపం ఏర్పాటు చేసినప్పటి చిత్రం.

# ప్రశ్నావళి

— కె. రామలక్ష్మి

**కబీరు. – అనంతపురం**

ఈ మధ్య వస్తున్న రచయిత్రుల నవలలో మగాడికి ఇద్దరు భార్యలను అంటగడుతున్నారు!

తీరని కోరికలు! చాకిరీకో భార్య. ఆదర్శానికో భార్య . . . కట్నపెట్టిందొక భార్య . . సంస్కారం కోరిందొక భార్య . . ఏం బాగా లేదా? పెద్దిల్లూ చిన్నిల్లూ మగవాళ్ల మినిమమ్ కోరిక అనుకొంటున్నారేమో— మా రచయిత్రులు!

**విజేంద్ర – ఆదోని**

ఒక మనిషి బ్రతికి ఉండగా అతని మంచిచెడ్డుల గురించి ఆలోచించని, గుర్తించని ఈ లోకం అతను చనిపోయాక గొప్పగా చెప్పుకుంటుంది ఏం పాడు లోకం!

ఏమిటి చచ్చాకకూడా ఏడిపోసుకోమనా మీ ఉద్దేశ్యం? మనిషి బ్రతికి ఉన్నప్పుడు—తనకై వాదించుకోకలడు. కాని చచ్చాక అతని తరపున మనం వాదించాలి, అది మర్యాద. నిల్ నిసి బోనమ్, ఎప్పుడూ వినలేదా?!

**పి జి. ఆర్. – తాడేపల్లిగూడెం**

ప్రేమించడంలో స్త్రీ గొప్పదా? పురుషుడు గొప్పవాడా? ఎందుచేత?

ఇద్దరికిద్దరేగొప్ప! ఇక ఎందుచేత అంటే ఏం చెప్పను? సుఖంగా జీవితం సాగిపోవాలని స్త్రీ, డబ్బు ఖర్చు తగ్గడం, తిండి నిద్రాసుఖం సులభమని పురుషుడు ప్రేమించామనుకుంటారని నా భావన.

**ఎమ్. వి. ఆర్. – వేట్లపాలెం**

ఎందుకొచ్చింది గడ్డం—సరసానికడ్డం అన్నారే! మరి వారి గెడ్డంపై కామెంట్?

మోజున్న మగవాని గెడ్డం కదా ఫరవాలేదు! ఐ లవ్ హిమ్ విత్ హిజ్ గెడ్డం అండ్ కోపం!!

**కె. ఎస్ – బొంబాయి**

ఈ మౌనం ఈ బిడియం ఇదేనా ఇదేనా చెలియ కానుక అనే మీనావారి పాట చక్రవర్తి చిత్రంలో ఎవరిపై చిత్రీకరించారు?

నాకు తెలియదు. నేనా చిత్రం చూడలేదు కనుక. కాని నాకా పాట చాలా చాలా ఇష్టం. అంతే!

**ఆర్. ఎస్. ఎస్ కాకినాడ**

అప్పటిదాకా దేవుని మీద నమ్మకం లేదని చెప్పి పరీక్షకు వెళ్లే ముందు, రిజల్ట్సు చూసుకునే ముందు దేవుని ఆరాధించేవారినేమనాలి?

ఏమైనా అని తీరాలా దేవున్ని నమ్మేవాళ్లని? అప్పటిదాకా ఉన్న ఆత్మవిశ్వాసం కాస్త సడలి కాస్త భారం దేవునిమీదకూడా వేద్దామన్న ప్రయత్నమే ఆ ఆరాధనకి అర్థం.

**ఎల్. వి. ఎస్. గూడూరు**

రామలక్ష్మిగారూ! ఏదైనా కొత్త సీరియల్ రాస్తున్నారా? ఆ పత్రిక పేరు చెప్పండి ?

లైఫ్ లా అండ్ మెన్ అని రాస్తున్నాను. ఇంకా ఏ పత్రికకూ ఇవ్వలేదు. నేను కాస్త స్లో రచయితని.

**కె జి ఎస్. కె కుప్పం**

మన సమాజం మనిషిలోని మంచికన్నా డబ్బుకి విలువనిస్తుంది. ఎందుచేత?

ఆ డబ్బే మనిషికి విలువనిస్తుంది కనుక.

మనిషికి నిజమైన తృప్తి ఎప్పుడులభిస్తుంది?

బ్రతికుండగా మాటుకు కాదు.

**వి ఏ. – కరీంనగరు**

ప్రతివారికి అభిమానులుంటారు కదా— మీ అభిమానులెవరో?

చెప్పడానికి మోహమాటంగా ఉంది గాని— మన రాష్ట్రపతిగారి నుండి ప్రారంభం —ఆ లిస్టు. ఏం మీకేం అసూయగా లేదుకదా!

ప్రేమ పిచ్చిదంటారు మరి అభిమానం?

వెర్రిది! ఎందుకంటే— దానిలో ప్రేమలో ఉండేపాటి స్వార్థం కూడా లేదు.

**ఎమ్. ఇ. డి. – మోరి**

ఒక దైవకార్యానికి రెండు రూపాయలు చందా ఇవ్వరు గాని సినిమాకు వెడతారు ప్రజలు.

అదే మంచి పని. దైవకార్యం పేరిట సంపాదించి బొక్కే భోక్త వేరు. రెండు రూపాయలు పెట్టి సినిమా చూస్తే— ఆత్మానందమైనా మిగులుతుంది!

**కె. వి ఆర్ – దువ్వాడ**

దేవాలయాలపై బూతు బొమ్మలు ఎందుకుంటాయో తెలియజేస్తారా?

మీ దృష్టి—దేవునిమీదో వీటి మీదో తేల్చడానికేననుకుంటాను.

**లక్ష్మణ్. రాయిగడ**

రచయితలకు మీ సలహా ఇవ్వమన్నారు. కారణమేమిటి? స్త్రీ పక్షపాతిగానేనా?

ఏం స్త్రీలు రచయితలు కారా?!

తను చూసిన సంఘటన తనకు ఎదురైన ఒడుదుడుకులు మనిషి తన భావాలనన్నిటినీ కాగితం మీద ఉంచితే అది మీలాంటి వారికి చిన్నతనమా? అవమానమా?

మధ్య నాకెందుకు చిన్నతనం — రాసినవారికుంటే ఉండాలిగాని! అయినా తన కష్టం తన సుఖం తన ఒడిదుడుకులూ అంత ప్రముఖంగా కనపడటంలో తప్పులేదుగాని, అవి రచనలుగా మారేటంతటివా ? ప్రశ్నించుకు చూస్తే చాలదా?!

## ఉత్తమమైన పౌడర్లు ఖరీదైనవి
## మరియు చౌక పౌడర్లు తేలిక రకాలు
# కాని
# స్వస్తిక్ ఉతికే పౌడర్
# అన్నిటికన్నా విభిన్నమైనది




2 కిలోలు,
1 కిలో,
500 గ్రాములు
మరియు
200 గ్రాములు
క్రొత్త పోలిప్యాక్‌లో

స్వస్తిక్ ఉతికే పౌడర్ అన్నిటికన్నా విభిన్నమైనది ఎందుకంటే దీనిలో మితవ్యయము ఉత్తమము అపురూపముగా కలిసినవి. అంటే ఇది చౌక మరియు ఉత్తమమైనది!

నీలి
**స్వస్తిక్**
డిటర్జెంట్ ఉతికే పౌడర్

Shilpi-DM 24/80 Tel

# ప్రశ్నావళి

**ఎస్. బి. ఎస్ ఆర్. – శ్రీకాకుళం**

మనిషికి జీవితంలో తీరని కోరికలేవి?

ఎదుటివారి తీరిన కోరికలు!

**యు.యు. — ఎమ్మిగనూరు**

నేటి సగటు మనిషికి కావలసినదేమిటి?

కూడూ గుడ్డా, కుదిరితే—తలదాచుకొనే చోటూ.

**ఎస్ ఎస్ జి. కటక్**

నేరానికి, పాపానికి తేడా ఏమిటి?

ఒకటి డెలిబరేట్‌గా చేసేది, రెండోది తెలియక చేసేది. అంతే.

**పి. ఎమ్. జె. పి గోవిందపల్లి**

నేటి నిత్యావసర వస్తువుల ధరలు ఆకాశం అంటుతున్నాయి. వీటిపై మీ అభిప్రాయం?

ఏముంది, మరీ నేల బారు జీవితాలయి పోతున్నాయని— ఆకాశమంత ఎత్తున ఎదిగిందని— మన ఆదర్శ ప్రభుత్ ఆశిస్తోంది.

**వి. ఎస్. ఆర్ హుబ్లి**

కులాంతర వివాహాలను ప్రోత్సహించే ప్రభుత్వమే— స్కూళ్లలో, ఉద్యోగాలలో చేరేటప్పుడు కులం ఏమిటి? అని అడుగుతుంది. ఏ కులం అని చెప్పుకోవాలి?

ఆ కాలమ్ నింపకండి ప్రభుత్వ లీలలు భగవంతుని లీలల కంటే విచిత్రంగా వుంటున్నాయి. ఎందుకు కులం! అంటే లెక్కలకి అంటారు. ఈ కాలమ్ వుండబట్టే— బ్రాహ్మలు వెనుకబడి పోయి, చితికి పోయారు. ఈ కాలమ్ వుండబట్టే కాని వాళ్లు కూడా ఎలాగో ఒకలాగ బి.సి. సర్టిఫికేట్ సంపాదించాలని చూస్తున్నారు. ఈ కాలమ్ వుండబట్టే— చుట్టరికాలు, రికమెండేషనులు— మెరిట్ స్థానాన్ని ఆక్రమించుకుంటున్నాయి. ఈ కాలమ్ వుండబట్టే— ఇతర వెనుకబడిన తరగతులలో చేర్చమని బ్రాహ్మణ సంఘం కోరుతూంది. దీన్ని వింతగా చెప్పుకోడం ఎందుకో నాకర్థం కాదు. బ్రాహ్మడికి మాత్రం భుక్తి గడవవద్దా! అక్షరం ముక్క అబ్బవద్దా? ఆర్థికంగా వెనుకబడిన జాతులనాలే గాని కులంరీత్యా వెనుకబడిన తనం నిర్ణయించడం— చాలా అవివేకమైన పని. అందుకే కాలం ఆ కాలమ్ తీసి పారేసి—రాబడి నిర్ణయించే— సర్టిఫికేట్లు ఆ స్థానం ఆక్రమించుకున్న నాడే— నిజంగా సంక్షేమ రాజ్యం ఏర్పడుతుంది.?

**ఆర్. ఎస్. ఎన్. కాకినాడ**

మీరు ఘాటు తక్కువ ప్రశ్నలకి మాత్రమే జవాబు చెప్తారు. నిజమేనా?

అయుండవచ్చు. మరీ ఘాటువి లెటర్‌బాంబుల్లాగా దారిలో పేలిపోతూ వుండి వుండాలి. ఘాటు తక్కువా ఎక్కువా అని కాదు, రుచి ఎలా వుంటున్నది కదా— ముఖ్యం?!



శ్రీమతి ఇందిరాగాంధీ (ప్రధానమంత్రి)

# గ్రామీణాభివృద్ధి పథకాలకు ప్రోత్సాహం

గ్రామాలకు శుభ్రమైన మంచి నీటిని సరఫరా చేయడం ప్రభుత్వ కార్యక్రమాలలో అత్యధిక ప్రాధాన్యత పొందుతోంది.



శ్రీ టి. అంజయ్య (ముఖ్యమంత్రి)

ప్రస్తుతం 58,000 గ్రామాలు, శివారు గ్రామాలలో బావులు, గొట్టపు బావులు, రక్షిత మంచినీటి పథకాల ద్వారా 1.43 కోట్లమంది ప్రజలు శుభ్రమైన మంచినీరు పొందుతున్నారు.

ఫ్లోరైడుకు గురైన గ్రామాలలో ప్రస్తుతం 22 లక్షల ప్రజలకు ప్రయోజనం కల్పిస్తున్న 1067 రక్షిత మంచినీటి పథకాలకు తోడుగా రు. 31.55 కోట్ల ఖర్చుతో 171 గ్రామాలలో 7.3 లక్షల ప్రజలకు ప్రయోజనం కల్పించేందుకు ఒక భారీ పథకాన్ని అమలు జరుపుతున్నారు. ఒక్క గ్రామీణ మంచినీటి సరఫరా పథకాలకే మొత్తం రూ. 87 కోట్లు కేటాయించారు.

గ్రామీణ మంచినీటి సరఫరా పథకాలకు రూ. 480 కోట్ల ఖర్చుతో ఒక బృహత్తర ప్రణాళిక రూపొందించారు. ఆరవ ప్రణాళికా కాలంలో నీటి ఎద్దడిగల 8,200 గ్రామాలలో మంచినీరు సమకూర్చేందుకు రూ. 173 కోట్లు ఖర్చు చేస్తారు.

గ్రామాలలో పరిశుభ్రతను పరిరక్షించేందుకు రూ. 175 కోట్లు కేటాయించారు.

"పనికి ఆహారం" పథకం క్రింద గత రెండేళ్లలోనూ 200 లక్షల మందికి ఉపాధి కల్పించారు. రూ. 85 కోట్ల విలువచేసే 4.82 లక్షల టన్నుల ఆహార ధాన్యాలు వినియోగించి 30,600 కి.మీ. పొడవు రోడ్లు, 2500 పాఠశాల భవనాలు, పంచాయతీ భవనాలు, బలహీన వర్గాలవారికి 98,000 ఇళ్ళు నిర్మించారు.

18,500 గ్రామాలను కలుపుతూ రోడ్లు నిర్మించారు. రూ. 965 కోట్ల ఖర్చుతో 16,700 గ్రామాలను కలిపే ఒక బృహత్తర పథకాన్ని రూపొందించారు.

4,144 సామూహిక బావులు నిర్మించి 31,080 ఎకరాలకు ఆయకట్టు కల్పించడం ద్వారా సన్నకారు రైతులు, గిట్టుబాటు గాని రైతులు ప్రయోజనం పొందారు.

తుఫాను నష్టానికి గురైన ప్రాంతాలలో 2,900 రోడ్లు, 4,500 భవనాలు, 2,300 చిన్ననీటి పారుదల పనులు పునర్నిర్మించారు.

దుర్భిక్ష ప్రాంతాలలో మంచినీటి సరఫరా కోసం 12,000 గొట్టపు బావులు త్రవ్వారు.

గత మూడు సంవత్సరాలలోనూ బలహీన వర్గాలవారికి రూ. 35 కోట్ల ఖర్చుతో 3.5 లక్షల ఇళ్ళు నిర్మించారు.

ఆంధ్రప్రదేశ్‌లో గ్రామాలు సమగ్రాభివృద్ధి పథంలో ముందడుగు వేస్తున్నాయి.

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

DIPR No. 2421/Advt. CI-3 81

# అవీ...ఇవీ...అన్నీ

## ప్రజాసేవలో నూరు రోజులు

రాష్ట్రావతరణ రజతోత్సవ సమయంలో శ్రీ టి అంజయ్య ముఖ్యమంత్రి అయినారు సమర్థవంతమయిన, నిష్కళంకమైన పరిపాలనకు ఆయన అత్యధిక ప్రాధాన్యతనిచ్చారు అభివృద్ధి కార్యక్రమాల అమలుకి అది చాలా అవసరం లోక్ ఆయుక్త, ఉపలోక ఆయుక్త ఏర్పాటుకు బిల్లుని శాసనసభలో పెట్టాలని గత అక్టోబరులో జరిగిన మొదటి రాష్ట్ర మంత్రివర్గ సమావేశంలో నిర్ణయించారు అవినీతిని అరికట్టడానికి ఫ్లయింగ్ స్క్వాడ్‌ల నియామకానికి నిర్ణయించారు

రాష్ట్రప్రభుత్వ ఎన్ జి ఒ లకు అనేక రాయితీలు కల్పించారు వారి సర్వీసు సమస్యల పరిశీలనకు ఉన్నతాధికార సంఘాన్ని ఒకదాన్ని ఏర్పాటు చేయుడానికి నిర్ణయించారు

రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు వెన్నెముక అయిన రైతుల సమస్యలని పరిష్కరించడానికి సత్ఫలితాల నిచ్చే అనేక చర్యలని, పథకాలను, ప్రణాళికలను అమలు చేశారు

కరువు ప్రాంతాలలో సహాయానికి విడుదల చేసిన 11 కోట్లు కాక మరో 16 కోట్ల రూపాయలు వెచ్చించాలని నిర్ణయించారు పనికి ఆహారం పథకం కింద విడుదల చేసిన 42 కోట్ల టన్నుల ఆహారధాన్యాలు కాక మరో 50 వేల కోట్ల టన్నులు విడుదల చేయవలసిందిగా కేంద్ర ప్రభుత్వాన్ని కోరారు త్రాగే నీటి సరఫరాకు దుర్భిక్ష ప్రాంతాలలో సహాయ కార్యక్రమాలను అమలు జరుపుతున్నారు 12 లక్షల ఎకరాలకు నీటిపారుదల వసతి కల్పనకు 76 కోట్ల రూపాయల జూరాల ప్రాజెక్టుకి ముఖ్యమంత్రి శంకుస్థాపన చేశారు రాయలసీమలోని కరువు ప్రాంతాలకు తుంగభద్ర నీటిని విడుదల చేయుడానికి కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వం అంగీకరించింది కృష్ణ నీటిని రాయలసీమకి మళ్లించే శ్రీశైలం కుడి కాలువ త్వరగా మంజూరు కావడానికి రాష్ట్రప్రభుత్వం గట్టిగా కృషి చేస్తున్నది

రాష్ట్రంలో ఎలెక్ట్రానిక్స్ కార్పొరేషన్ నిర్మాణానికి తలపెట్టారు 12 భారీ, 14 చిన్నతరహా సిమెంట్ కర్మాగారాలు తయారవుతున్నాయి అనంతపురం, మెదక్, శ్రీకాకుళంజిల్లాల్లో పారిశ్రామికీకరణకు రు 50 కోట్ల పథకాన్ని అమలు చేస్తున్నారు తిరుపతిలో రైల్వే కేరేజి రిపేరు షాపు, మెదక్‌లో ఆల్విన్ వాచి తయారీ కేంద్రం రాష్ట్రములో పారిశ్రామిక ప్రగతికి తార్కాణం

1980—81 సంవత్సరంలో 67 వేల మందికి ఉపాధి కల్పనకు 46 వేల చిన్న పరిశ్రమల అభివృద్ధి తలపెట్టారు వచ్చే 5 ఏళ్లలో ప్రతి గ్రామంలో ఒక చిన్న పరిశ్రమ ఏర్పాటుచేస్తారు త్వరలో మరో 8 జిల్లాలకి పారిశ్రామిక కేంద్రాల స్థాపన జరుగుతుంది ఈ ఏడు మెదక్, రంగారెడ్డి, అనంతపురం జిల్లాలను నూటికి నూరు గ్రామాల విద్యుద్దీకరణ పథకం చేపట్టారు

షెడ్యూలు కులాలు, తరగతులు, వెనుకబడిన తరగతుల వారి పిల్లలకు స్కాలర్‌షిప్పులు, హాస్టలు ప్రవేశానికి వీలుగా ఆదాయ పరిమితిని రు 6 వేల నుంచి రు 12 వేలకి పెంచారు క్రైస్తవులుగా మారిన షెడ్యూలు కులాలవారికి, వెనుకబడిన తరగతులవారు పొందే సదుపాయాలను కల్పించారు

గిరిజనాభివృద్ధికి వచ్చే అయిదేళ్లలో రు 250 కోట్లతో పథకాన్ని అమలు జరుపుతున్నారు పాలూరులో గిరిజన విశ్వవిద్యాలయ స్థాపనకు నిర్ణయించారు

పాలవెల్లువ కార్యక్రమం రెండవ దశ పథకం అమలుకు మన రాష్ట్రాన్ని ఎంపిక చేశారు దానికి వీలుగా సహకార పాల సంఘాల రాష్ట్ర సమాఖ్యని ఏర్పాటుచేశారు ఈ పథకం వల్ల పాలసేకరణ 1500 లక్షల లీటర్ల నుంచి 1900 లక్షల లీటర్లకి పెరుగుతుంది (ప్రా॥ స॥)

# భద్రత అన్నది కేవలం ఒకే తాళంపై ఆధారపడినప్పుడు ఉన్నది ఒక్కటే తాళం, అదే...

## నవ-తాళ్




ULKA NT 1180 TEL

అవును గోద్రెజ్ 'నవ తాళ్' ఇతర మామూలు తాళాల కన్నా కాస్త ఎక్కువ ఖరీదే, అయితే మీ భద్రతకు పూర్తిగా నమ్మదగ్గ ఒక తాళంపై కొంచెం ఎక్కువ డబ్బు ఖర్చు పెట్టడము వివేకం. చూసేందుకు ఇతర తాళాలు 'నవ-తాళ్' లా కనిపించవచ్చు కాని పనితనం నాణ్యత విషయంలో అవి దీని ఛాయకు కూడ చేరలేవు
విరగని తీరులో యాంత్రిక శక్తితో ఇది తయారుచేయబడింది. అందుచే 'నవ-తాళ్' కేవలం దాని యొక్క తాళం చెవితోనే తీయుట సాధ్యం.

ఇత్తడితో పోత పోయబడి అధిక దృఢత్వం కోసం 'రివెట్లు' లేకుండా ద్విగుణీకృతమైన 'కేసింగు' కలది. బ్యాంకుల్లో, ఆఫీసుల్లో, దుకాణాల్లో ఫ్యాక్టరీలలో, గిడ్డంగులలో యిళ్ళల్లో ఎక్కడ భద్రత అవసరమో అక్కడ 'నవ-తాళ్' భద్రత నిస్తుంది తాళాలు చేయుటంలో 80 సంవత్సరముల పైగా అనుభవం గల గోద్రెజ్ వారిచే తయారుచేయబడింది ఇది దేశం అంతట్లోనూ అత్యధికంగా అమ్ముడయ్యే తాళం "గోద్రెజ్ నవ-తాళ్" అవటంలో ఆశ్చర్యం ఏముంది.

నాలుగు సైజుల్లో దొరుకును!

| | |
|---|---|
| 40 మి.మీ | 5 లివర్లు |
| 50 మి మీ | 6 లివర్లు |
| 65 మి మీ | 7 లివర్లు |
| 85 మి మీ | 8 లివర్లు |

**గోద్రెజ్** Godrej

# వారఫలం

20-2-1981 శుక్రవారం మొదలు
26-2-1981 గురువారం వరకు

మేషం:— కర్కాటకంలో రాహువు, కన్యలో శని, గురు గ్రహాలు, మకరంలో కేతువు ముఖ్య గ్రహస్థితులు మీ రాశికి. అందుచేత, భారీ వ్యాపార స్థలు, కొన్ని మార్పులు చేయుటకూడా జరుగును, బంధువుల తాకిడి విశేషంగా ఉంటుంది. వ్యాపార మూలక యిబ్బందులు రాకుండా చూచుకోవాలి. నగలు కొనటం కూడా సాధ్యమే. స్త్రీలకు: విద్యా వైజ్ఞానిక రంగాలలో విశిష్ట స్థానం లభింపనున్నది.

వృషభం:— మంచికే పోతారు మీరు, అయినా చెడు సంభవించే వారం. ఆరోగ్యం బాగుండాలిగాని, ఎన్ని మార్పులైనా, మీ వ్యాపార రంగంలో, ఉద్యోగరంగంలో సంభవింపనున్నవి. ధైర్యంతో ఎదుర్కోవాలి. ధనాదాయం ప్రోత్సాహకరం గాదని చెప్పవచ్చు. చిక్కులు నివృత్తి కావాలంటే, యింకా కొంతకాలం పడుతుంది. స్త్రీలకు: ఆదాయం లేకపోగా, కుటుంబ భారం అధిక మవుతుంది. వినోద కాలక్షేపంతో కాలం వ్యయపరుస్తారు.

మిధునం:—కుటుంబ ఖర్చులు అధికం, మానసిక వ్యధ కూడా చెప్పదగిన వారం. దైవకార్యాలు సుముఖంగా నెరవేరే మార్గం లేదు. తలమీదనో, శరీరం పైననో, కురుపులు లేవవచ్చు. తద్వారా అనారోగ్యం కనిపిస్తుంది. మిమ్ముల మోసగించే వారుంటారు. ఈ వారంలో జాగ్రత్త! స్త్రీలకు: ఉన్నతోద్యోగంలోని వారికి అనుకూలత, కొందరకు నూతనోద్యోగ ప్రాప్తి.

కర్కాటకం:— ఆడంబరం అధికం. అనేక విషయాలు తెలిసికొని, మున్ముందు జీవితానికి మంచి మార్గం ఏర్పరచుకోగలరు. చుట్టుప్రక్కల వారి, ఓర్వలేని వారి బెడద కూడా చెప్పదగిన వారం. ఇందుకు తోడు ఆరోగ్య లోపం కనిపిస్తుంది. అవకాశాలు కూడా సద్వినియోగం చేసికోలేకపోతారు. స్త్రీలకు: ముందు ముందు లాభించే పనులందు శ్రద్ధ వహింపగలరు. ఆదాయమున్నది. గ్రహించండి.

సింహం:—పేరు ప్రతిష్ఠల సంపాదనకు లోపం లేదు. వృత్తి ఉద్యోగాలలో ఆదాయం చెప్పదగిన సంత ఉన్నా, ఏదో లోపం కనిపిస్తూనే ఉంటుంది. భూముల నుండి, యిండ్ల మూలాన లాభించే వారం. గృహ విస్తరణ కార్యకలాపాలలో నిమగ్నులు కావటం కూడా మీరే గమనిస్తారు. స్త్రీలకు: చుట్టుప్రక్కల యిబ్బందులు, చిన్న చిన్న తగాదాలు రేకెత్తే మార్గమున్నది. ప్రయాణంకూడా కొందరకి పట్టే సంభవం.

కన్య:— మీ రాశికి ఈ వారం యోగప్రదమే వారం రోజాలు, ఏదో ఒక విధంగా ఉత్సాహ జనక వైవాతావరణం ఏర్పడనున్నది. ఆదాయమున్నది. వ్యయం కూడా అధికమే. వృత్తి వ్యాపారాలలో ప్రోత్సాహం ఉన్నా, పెద్దగా లాభార్జన చెప్ప వీల్

లేదు. స్త్రీలకు: శ్రమాధిక్యత గలవారం అవకాశాలు ధనార్జనకు కొన్ని ఏర్పడుతాయి. గాని, సద్వినియోగం చేసికోలేక పోతారు.

తుల:— ఈ వారం మీకు అనేక విధాల ప్రోత్సాహకరంగా ఉంటుంది. శ్రమకు తగిన ధనాదాయం కలదు. నగలు, నూతన వస్త్ర సేకరణకు అనుకూలం వారం. విందు వినోదాలతో పరులకు సహాయం చేయటంతో, కాలం వ్యయింపనున్నారు. మనస్సుకు ఆనందం కలిగించే అవకాశాలు లభిస్తాయి. స్త్రీలకు : నిరుత్సాహత నమసిపోతుంది. ఆడంబరాలకు వ్యయం చేయనున్నారు.

వృశ్చికం:— ధనాదాయం తృప్తికరం. నూతన వ్యాపారం ప్రారంభించుటకు పునాది వేయగలరు. ఆస్తి కొనే ప్రయత్నమో, గృహ నిర్మాణ కార్యక్రమమో, ఇంటి మరమ్మతులు చేయాలనే సంకల్పమో ఏర్పడగలదు. అవసరాలు తీరే మార్గమున్నది. స్త్రీలకు: బంధువుల మూలాన అవసరాలు తీరే మార్గమున్నది. ఎవరో కొందరు కావలసిన వారు సూటి పోటి మాటలతో మనస్సుకు చికాకులు కలిగిస్తారు. నిదానం ప్రధానం.

ధనుస్సు:— చాలా విజయప్రదమైన వారం. చెడిపోయిన వ్యవహారాలు ఒక మార్గానికి రాగలవు. క్రయ విక్రయాలలో లాభించే వారం. మీ మాట కాదని విభేద పడిన వారు, మరలా కలిసికోవటానికి ప్రయత్నించ గలరు. ఆదాయం అందుకొంటారు. నిత్యావసరములే కాక, ఇతర విధంగా అవసరాలు తీర్చి కొంటారు. స్త్రీలకు: ఉద్యోగ వృత్తులందు ప్రగతి, ఆనందం సంభవం.

మకరం:— మిక్కిలి పట్టుదల గల ప్రకృతి మీది. మకర పట్టుతో కార్య సాధన గావించ గలరు. వాల్గు విధాలా లాభదాయకం. సాహిత్య కళారంగాలలో మీ సాధన ఫలించే మార్గమున్నది. స్త్రీలకు: అవసరాలు తీరుటకు, నూతన వ్యవహారాలు తెలిసికొనుటకు, నగలు కొనుటకు అనుకూల వారం.

కుంభం:— మీరు ఆలోచించి చేసిన ప్రయత్నాలే సమయానికి ఫలింపకుండుట, ఆదాయలోపం, అప్పు చేయవలసిరావటం, అధిక వ్యయం, సంతానం కోసం శ్రమింపవలసి రావటం, దావా తగాదాలకు తల ఒగ్గటం గమనించ గలరు. ఇన్ని విధాల ఇబ్బందులుంటే ఏ విధంగా అనుకూలవారం మీకు? స్త్రీలకు: కుటుంబ పరిస్థితులు ఆశాజనకంగా ఉండగలవు. స్వల్పాదాయమున్నది.

మీనం:— ఆడబోయిన తీర్థమెదురైనట్లు తలంచిన బంధువులో, మిత్రులో మిమ్ములను కలిసికోనున్నారు. అనేక విషయములు మీకు అనుగుణ్యంగా చర్చకు రాగలవు. వృత్తి ఉద్యోగాలలో అనుకూలత గలదు. నూతన విషయాలు లాభదాయకమైనవి, ఆప్తులనుండి తెలిసికోగలరు. స్త్రీలకు : కుటుంబానందం, శుభ కార్యాలోచనలు ఆదాయం అప్రయత్నంగా చెప్ప దగిన వారం.

— విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి


Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna.

